వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులవారి

# జీవామృతము (రిజిష్టర్డు)

సుప్రసిద్ధమగు యీ బలవర్ధకౌషధమును బలహీనతకు చిక్కిన ఎల్లరు సేవింపనగును. ఏ కారణముచేత దేహము నిర్వీర్యత, నిస్సత్తువకు పాలుపడినను యీ జీవామృతము చక్కని దేహమనోబలములను, ఉత్సాహమును, వీర్యపటుత్వమును, ప్రసాదించును.

రెండు సైజులలో దొరకును. పెద్దది రు 3-4-0; చిన్నది రు 1-12-0

# బాలభాస్కర (రిజిష్టర్డు)

బిడ్డల లివర్ & స్ప్లీను జాడ్యములకు అమోఘౌషధము.

దీనివాడుక జాడ్యము చేరకుండ కాపాడుట మాత్రమే గాక జాడ్యము ముదిరినను నిస్సంశయముగు గుణమిచ్చి మంచి ఆరోగ్యమును కలిగించును. కెమిస్టు లందరి యొద్దను దొరకును.

వివరములకు

ఆయుర్వేదాశ్రమము

151. గోవిందప్పనాయక వీధి, తపాలపెట్టె 287,

మదరాసు

“ ప్రబుద్ధాంధ్ర ”



శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు




౬ సంపుటము　　రాజమహేంద్రవరము　జనవరి ౧౯౩౫　　౧ సంచిక

# తల్లిప్రాణం

సుబ్రహ్మణ్యశాస్త్రి—సంపాదకుడు



"చెప్పిన మాట విను"

"నేను వినసండీ"

"అలా కాదు. కొంచెం ఆలోచిస్తే నీకే తెలుస్తుంది యేమీ లాభం లేదని"

"చదువుకుంటే లాభం వుండదని మీరు కనక అనగలిగారు. వూరుకోండింక"

"శిరోమణి పరీక్ష యిచ్చినా మొగాళ్లకే దిక్కూ దివాణమూ కూడా లేకుండా వున్న రోజులివి. అమ్మాయి విద్వానయితే—"

"అయితే అని సందేహం యెందుకూ ?"

"అవుతుందే అను. అయితే అది వుద్యోగం చేస్తుందా వూళ్లేలుతుందా?"

"చెయ్యకపోడానికి తెలివితక్కువదా, చురుకు లేనిదా ?"

"అది కాదు.........అవసరం—"

"అంటే ?"

"అది తప్ప మనకి మరెవ్వరూ లేరుకదా, యిదంతా అనుభవించక నాకరీ కర్మం యేమిటీ దానికీ ?"

"అనుభవించడానికే పెట్టిపుట్టిందా అమ్మాయి ?"

"........................"

"చేతులారా దాని గొంతుక పిసికేశారు మీరూ మీ అమ్మానూ. మొగుడు చస్తే చచ్చాడు చదువనీ, పుస్తకాలనీ, పత్రికలనీ, సభలనీ—ఆనందట్లో పడేనా కాలం గడిపేసుకోనివ్వండి దాన్ని"

"కావలసినన్ని వ్రతాలు చేసుకోవచ్చు. తీర్థయాత్రలు—"

"బుర్ర కూడా గొరిగించేస్తా నన్నారు కారు నయమే కొంతవరకు"

"........................"

"అమ్మాయి జోలి మీకక్కరలేదు. "మేనరికానికి వొవ్వుకో"నని నేనెంత మొత్తుకున్నా, "నాకీ మొగుడు వద్దు మొర్రో" అంటూ అదెంత యేడ్చినా మొండి పట్టు పట్టి యింతకు తెచ్చారు కావరం. పుట్టిన వాక్క బిడ్డా మోడయిపోయి—మీకు జాలి వుందా? కనికరం వుందా? దుఃఖం యెరుగుదురా మీరు?"

"........................"

"అంత చక్కని పిల్లని మీరా రెక్కడేనా చూశారా? దాని తెలివితేటలికి హద్దు చెప్పగలరా మీరు? దాని పామేదా, దాని వొబ్బిడి, దాని నిదానం—ఇవన్నీ గంగలో కలిసిపోవలసినవే?"

"..........................."

"మంకుపట్టు పట్టానని మీకు కోపం అక్కరలేదు. ఇది తప్పు మీరేం చెప్పినా—యిదివర కల్లా విన లేదూ?"

"......................."

"ఆడదాని మాట వినడం నామోషీ అనుకుంటూన్నారేమో, తల్లిమాటా, అక్కమాటా వినడంకంటే తప్పుకాదు పెళ్లాం మాట వినడం"

"మరొకటీ, మరొకటీ అయితే—"

"ఇది మరొకటి కాక యింకేమిటి?"

"......................"

"ఆడాళ్ల కష్టసుఖాలు మొగాళ్లకి అర్థం కావు. చావలేక బతికివున్నాను నేను. ఏడవలేక నవ్వుతున్నాను. గుండెలమీద కుంపటిలాగ భరించీదాన్ని నేను. మీ కేం తెలుస్తుంది?"

"......................"

"వొక్కరోజు మీరింటో లేకపోతే—వొక్కపూట కనపడకపోతే యెలాగో వుంటుంది నాకు. మొన్ననే పదిహేనేళ్లు నిండిన పిల్ల. దానికి వైరాగ్యం పట్టుబడటం అంటే మాటలా?"

"......................"

"పోనీ, మీమాట చెప్పండి. మీరు నాకేసి చూడ్డం మానేస్తారా?"

"..........................."

"నాతో మాట్లాడకుండా వుంటారా?"

"..........................."

"వొక్కదానికీ జవాబు చెప్పకపోతే యేం చేతున్నా నేను?"

"ఇప్పుడే కాదూ నువ్వు వద్దన్నావు?"

"వద్దే"

భద్రమ్మ తీక్ష్ణంగా చూసింది. ఆచూపులు భరించక రామబ్రహ్మం మొగం పక్కకి తిప్పుకున్నాడు.

ఇద్దరూ వొక్క నిమిషం వూరుకున్నారు.

తరవాత, భద్రమ్మ, మేజామీద వున్న తాంబూలపు పళ్లెం వొడిలోకి తీసుకుని "ఇలా తిరగండి" అంది.

అతను మాట్లాడకుండా తిరిగాడు.

"దగ్గిరికి రండి"

"అతను జరిగాడు"

"నాకేసి చూడండి"

అతను చూశాడు.

"కోపం వచ్చిందా?"

అత నందుకు జవాబు చెప్పకుండా ఆమెనోటికి తమలపాకుల చిలక లందించాడు.

౨

కండువా మడత విప్పుతూ రామబ్రహ్మం వీధిసావిడిలోకి వచ్చాడు. వెంకుసోదెమ్మ గంభీరంగా చూస్తూ "యే మాలోచించావు నాయనా?" అంది.

"ఇంకా యేమీ నిశ్చయించలేదమ్మా"

"ఏమీ అంటే?"

"చదువు చెప్పించడమా మాన్పించడమా—"

"చెప్పించడం యిదివరకే జరుగుతోంది. ఇక నువ్వాలోచించవలసింది మాన్పించడం మాటే"

"......................"

"నలభై అయిదేళ్లవాడవు, చిన్నాడవా, చితకాడవా? ఈపాటికి కాస్త పెద్ద తరహా నేర్చుకోవాలి"

"......................"

"నువ్విలాగ నీళ్లు నములుతూ కూచుంటే—అప్రతిష్ఠ వచ్చిందంటే—"

"చదువుకుంటే అప్రతిష్ఠ యేమిటమ్మా?"

"......................"

"పోనీ, బడికి వెళుతోందేమో అంటే అది లేదాయె. ఇంటో కూచుని—"

"నువ్వు వచ్చి నన్ను తీసుకుపో" అంటూ కృష్ణమూర్తికి రుక్మిణీదేవి వుత్తరం రాస్తుందిట. ఆవళంగా ఆవిడ కులదేవతకి మొక్కడానికి గుడికి వెడుతూ వుంటే అతగాడు అడ్డం వచ్చి—ఇలాంటిదేనా యీాడు వచ్చిన పిల్ల మొగాడిదగ్గిర చదవ్వలిసింది?"

“.....................”

“పైగా, పాతికేళ్ల వాడు కళ్లు తిప్పుకుంటూ పాఠం చెప్పడమా ?”

“.....................”

“సుందరి యేం చేస్తోందండీ అమ్మమ్మగారూ” అంటూ వస్తాడు గురువు నని పేరుపెట్టుకునీ ఆపిల్లాడు. తాను నాకు కూతురి కొడుకా ? ఇది కొడుకు కూతురా ? వరస యెలా కల్పించాడో చూశావా ?”

“... ..................”

“ఆహితాగ్నుల కుటుంబంరా మనదీ. అక్కడ అక్కా బావా యిది విని సిగ్గుతో కుళ్లి చచ్చిపోతున్నారు్రా”

“.....................”

“నీకు మాత్రం తెలవనక్కరలేదూ ?”

“అమ్మాయి యేమంటుందీ ?”

“మచ్చికవడింది, అది మానుతుందా ?”

“.....................”

“ఇవాళ ఆపిల్లాడు వస్తే “మా అమ్మాయి యిక చదువుకోదు, వెళ్ళిపో” అని చెప్పెయ్యనా ?”

“.....................”

“మాట్టాడ వేమిరా ?”

“అయితే: అక్కకీ బావకీ సిగ్గెందుకూ ? కుళ్ళి చచ్చిపోవలసినంత—”

“అయ్యో! అయ్యో! కొడుకు చచ్చిపోయాక- ఈడు వచ్చిన కోడలు వీధెక్కి చదువుకుంటోం దంటే— ఏమిట్రా, నీకింత మంచీ చెడ్డా తెలవకుండా వున్నాయీ!”

“మనం మాత్రం మన అమ్మాయి మంచిచెడ్డలు చూచుకోమూ ?”

“చూచుకోవా లనే కాదూ నేను చెప్పడం!...... అల్లుడు చచ్చిపోయా డని నీపెళ్లాని కేమేనా—సుందరమ్మ కేనా దుఃఖం—అసలు నీపెళ్ళామే మార్చేస్తోంది దాన్ని”

“ఎలా మారుస్తోందీ ?”

“ఏమో. నీమామగారు వీరేశలింగానికి స్నేహితు డని లోకం అంతా యెరుగుదురు”

“వీరేశలింగంగారు చచ్చిపోయారు కామా ?”

“నీమామగారు—”

“తప్పుతప్పు. ఎవళ్లేనా వింటే బాగుండదు వూరుకో. నువ్విలాంటి మాట లంటావు కనకనే నీకూ కోడలికి పడకపోవడం”

“నేను పోరి అమ్మాయిని కిష్టప్ప కిప్పించా నని— అక్కకీ బావకీ అప్రతిష్ఠ రావడంకోసం నీపెళ్లాం—”

“అప్రతిష్ఠ రావడంకోసం ?”

“పిల్లమనస్సు—”

“పిల్లమనస్సు.........ఏమిటి ?”

“మొన్న వొక కోమట్లపిల్ల మళ్ళీ పెళ్ళి చేసుకుని యీవీధిలో వూరేగితే నీపెళ్ళామూ, అమ్మాయీ సంబరపడుతూ వీధి అరుగెక్కి—”

“నువ్వు చెబుతూ వున్న వేదాంతం నాకు బోధపడ్డం లేదు. ఏమిటేమిటో కల్పించుకుపోతావు గాని అసలు సంగతి—”

“నువ్వు గ్రహించుకోవాలి; గాని యింతకంటే యేం చెప్పనురా నేనూ ?”

“చెప్పలేకపోతే వూరుకో. నువ్వూ కోడలూ యేదో కుళ్ళు పెంచుకుంటూ మధ్య నన్నేడిపిస్తున్నారు. మీ గొడవలు నేను తీర్చలేను”

“వెళ్ళిపోతావుట్రా ?”

“.....................”

“వోరి చచ్చుపెద్దమ్మా ! ఇంచేతే—నీదగ్గిర చేవ యింతగా వుండమట్టే ఆపీనుగు వొంటికాలి భరతం ఆడుతోంది.........అమ్మమ్మ నిట నేనీ పాజీకి. నామన మడు చచ్చి నేనేడుస్తూ వుంటే మధ్య యీాదగాకోరు— రానియ్యి”

ఇలా రుంజుకుంటూ వెంకుసోదెమ్మ అక్కడే కరా యించుకున్నాచుంది.

3

“చూశావుటే అమ్మా ?”

“ఏమిటమ్మా ?”

“శాస్త్రిల్లుగారు రాలేదుటే”

"ఎంచేతో ?"

"వచ్చి వెళ్లిపోయారుట"

"ఎవరు చెప్పారూ ?"

"నాయనమ్మ"

"రాలేదని యెవరు చెప్పారూ ?"

"నాయనమ్మే"

"వొకమాటు రాలేదనీ, వొకమాటు వచ్చి వెళ్లిపోయా రనీ—"

"వుండకుండా వెళ్లిపోయినప్పుడు వచ్చినా రానట్టే కాదూ అంది నాయనమ్మ"

"అలాగా ?......చూశావా ? ......ఏవో వుల్ల దిరుపుమాట లని ఆవిడే పంపేసి వుంటుంది"

"పరీక్షలు దగ్గిరికి వస్తున్నాయే. ఈసంవత్సరం ఆఖరిది కూడానూ"

"మీనాన్న రానియ్యి చెబుతాను"

"...... ...ఇప్పుడు వాళ్లి రామలక్ష్మికి పాఠం చెబుతూవుంటారు శాస్త్రిల్లుగారు. అక్కడికి—"

"అక్కడ కాదు. సోమశేఖరంమామయ్యగారి యింటికి వెళ్ళి, వాళ్ళ లచ్చిగాణ్ణి పంపి రప్పించిపెట్ట మని అత్త నడిగి యివాళకి అక్కడ చెప్పించుకో పాఠం"

"అలాగే"

"రామలక్ష్మిగారి యింటికి వెళ్ళకు సుమా"

"వెళ్ళను వెళ్ళను. మొన్న యెలాంటి మాటలందో చూశావా ? నేను మరిచిపోతానేం ?"

* * * * *

"మాబావ వుత్తరం రాశాడు"

"ఏమనీ ?"

"అమ్మాయిని చదువు మాన్పించ మనీ"

"కొడుకు చచ్చాక కూడా తమ పెత్తనం యేమిటి చడిపె త్తనం ?"

"....................."

"మీ అమ్మ యేవో రాసివుంటుంది వున్నవీ లేనివీ కల్పించి"

"వూళ్ళోవాళ్లు కూడా నన్నాక్షేపిస్తున్నారు"

"ఎందుకో ?"

"చదువు మాన్పించడం యిష్టం లేకపోతే ముసలి పండితు డెవరూ దొరకలేదా—"

"చదువు చెప్పించడానికి వొప్పుకున్నారు కదా ?"

"వాళ్ల సలహా యేమో మానిపించమనే"

"పనిలేని మంగలి పిల్లితల గొరిగాడుట"

"....................."

"వేంకటదీక్షితులుగారి సోమిదేవి కాళ్లకి జోడు తొడుక్కుని, నెత్తిమీద గొడుగు వేసుకుని నన్నే చూసుకోండంటూ దొరసానిలాగ మొగాళ్ళ నందర్నీ రాసుకుంటూ బడికి వెడుతూ వస్తూ వుంటే నోరెత్తలేని వాళ్ళు మన అమ్మాయికి చక్కట్లు దిద్దుకోవడం యెందుకూ ?"

"మన వంశం అలాంటిది కనక"

"అ-లా-గా ?"

"ఏం తక్కువా ?"

"అయితే ; వంశం వంశం అని మహాగొప్ప చెప్పుకుంటున్నారుకదా, మీవంశంలో మొగా ళ్లైనా చదువుకోకుండా—ప్రయోజకత్వం లేకుండా వున్నారా యిదివరకి ?"

"....................."

"మీ అక్కలాగ గిల్లి, రక్కి, యేడ్చి, దొర్లి పట్టు నెగ్గించుకునీవాళ్లైనా పుట్టారా మీవంశంలోను ?"

"....................."

"పోనీ, మీఅమ్మ అమ్మాయిని "కాకినాడ వెడదాం ర"మ్మందిట విన్నారా ?"

"ఎందుకో ?"

"వెధవకోడళ్లూ, వెధవకూతుళ్లూ వున్నవాళ్లకి దాసీలూ, వంటలక్కలూ అక్కర్లేమట కాదూ ?"

"....................."

"రామేశ్వరం ప్రయాణం కూడా తలపెట్టిం దన్నమాటేనా మీ అమ్మ ?"

"....................."

"ఎలాంటి ఆలోచనలు జరుగుతున్నాయో తెలుసోందా ?"

"........................"

"ఆరెండుకట్టని చూసుకుంటూనేనా బతకనిచ్చేటట్టు లేదన్నమాట కాదూ మనల్ని ?"

"అలా అందా మా అమ్మ ?"

"అమ్మాయి అబద్ధం చెప్పిందనే ?"

"......నువ్వూ మాఅమ్మా వేసే యెత్తులు చూస్తే కంగారెత్తిపోతోంది నాకు"

"అయితే నేను కూడా యెత్తులు వేస్తున్నా నన్నమాట. అవునా ?"

"......................"

"అమ్మాయి మీద కూడా యేదో తుట్ట వడేసెయ్యండి"

"......................"

"అర్థాయువ్వవు—కొంకనక్క మొగుణ్ణి కట్టిపెట్టిన మీకు సందేహం వుండదు కాని—"

"అమ్మాయి యేం జవాబు చెప్పిందో ?"

"దాన్నే అడగండి మీరు"

"......................"

"వెడతారేం ?"

"........................"

"కాఫీకి వేళ అవుతోందండీ"

"మేడమీద వుంటాను"

"అయితే, నేనూ వస్తాను పదండి"

"కాఫీ చెయ్యవూ ?"

"అమ్మాయి చేస్తోంది......"ఇక నే నెలాగా అత్తవారి యింటికి పోవలసిన దాన్నే కనక, వున్న నాలుగు పూటలేనా కాఫీ నేనే చేసి యిస్తాను నాన్నగారి" కంటూ అది సిద్ధపడింది నన్ను దూరంగా కూచో మని"

"...చేతులు కాల్తాయేమో పాపం, నువ్వు తేవడమేనా చెయ్యరాదూ ?"

"దాని ప్రాణాలకే యెసరుపెడుతోంది మీ అమ్మ చేతులు కాలడం అంతకంటె యెక్కువా ?"

"శూలాలతోటీ, యీటెలతోటీ పొడిచేస్తున్నావు"

"ఇలా చూడండీ !.........నేనే ?"

"........................"

"........................"

"పైని వుంటా మని చెప్పేనా రా పాపం"

"దానిమీద మీ కంత జాలేవుంటే. అది వున్న చోటికే వెడదాం రారాదూ ?"

"అయితే పద"

"నేను పాన్‌దాను తీసుకువస్తాను మీరు ముందు నడవండి"

"......................"

"మీ రెండుకూ పైకి ?"

"నువ్వూ నేనూ కలిసే వెడదాం ......"

"......నాకొద్దుబాబూ !"

"ఊ, పా"

"నేనొవ్వుకోనండీ"

"......................"

"వల్లకాదు......వినండి......వదలండి.....మెట్లమీద కట్టకట్టుకు నడిస్తే......అబ్బ......ఏమో.......అమ్మాయీ !"

"......................"

"వోమా టిలా—పిలిచెయ్యనా ?"

"ఇప్పుడు చేసిం దేమిటో ?"

"లేకపోతే మీరు మరీని......అలాగ......అలాగ...వొళ్లూ వొళ్ళూ తగుల్తూ నడిస్తే చాలదూ ?"

"నువ్వు చిన్నపిల్లలాగ—ముద్దొస్తూ—"

"నుంచోండి వొకమాటు"

"ఎందుకూ ?"

"ఇరవై యేళ్ళ నుంచి కాపరం చేస్తూవున్న మనమే యిలాగ—"

"మొగుడికీ, పెళ్ళానికీ యిరవై యేళ్లేమిటి ముప్ఫయ్యేళ్ళేమిటి ప్రే—"

"అయితే మొగుడు లేనివాళ్ళ గతి యేమిటి ?"

"......................"

"జవాబు చెప్పరేం ?"

"......................"

"మాట్టాడ రేమండీ ?"

"పైన చెబుతాను రా"

"నాకక్కర్లేదు"

"బంగారపు బొమ్మవు కాదూ ! రత్నాల సొమ్మువు కాదూ ?"

"ఏమో !"

"...................."

"గడ్డంపట్టుకు బతిమాలితే నాకు వొరిగిందా యేమిటి ?"

"........................"

"నాన్నగారండీ !"

"అదిగో. అదిగో......పలకరేం ?"

"...................."

"అమ్మా ! ఎక్కడున్నావే ?"

"ఇద్దరమూ చెట్టాపట్టాలు వేసుకుని వొక్కమాటే పలుకుదాం ఏం ?"

"అడగక్కరలేదు. మీరు పదండి ముందు...... వెళ్లండి"

"...................."

౮

"నువ్వు ఆడపిల్లలకే గాని మొగపిల్లలికి పాఠాలు చెప్పలేవా యేమి టబ్బాయీ ?"

"చెప్పకేం ?......ఇలా అడిగా రేం ?"

"తెలవక అడిగానులే"

"నాకు డబ్బెవరిస్తే వారి కందరికీ చెబుతాను చదువుకోడానికీ, చదువు చెప్పడానికీ ఆడా మొగా భేదం యేమి టండీ అమ్మమ్మగారూ ?"

"నేను అమ్మమ్మనా నీకు ?"

"...................."

"నాయనమ్మా" అనకూడదూ?"

"అప్పుడు మాత్రం యీ ప్రశ్న రాదూ ?"

"అసలు నన్ను వరసపెట్టి పిలవడం యెందుకూ నువ్వు ?"

"వద్దంటే—మాట్లాడడం కూడా మానేస్తాను"

"మానెయ్యి. తప్పకుండా మానెయ్యాలి"

"విధిగా మానేస్తాను. మిమ్మల్ని వరసపెట్టే కాదు యెవరికే పిలవడమూ—పలకరించడమూ కూడా నాకేమీ అవసరం లేదు"

"...................."

"......సుందరీ !"

"...సుందరమ్మా" అనలేవూ ?"

"...................."

"మాట్లాడవేం ?"

"...................."

"నిన్నే"

"...................."

"......అలా నుంచో దిమ్మచెక్కలాగ......"

ఇలా ధుమధుమలాడుతూ లోపలికి వెళ్లి తలుపులు బిగించుకుంది ముసలమ్మ.

*  *  *  *  *  *

"ఎక్కడికో వెళుతున్నారు కామోసు"

"అవును"

"ఇనప్పెట్టె తాళం తీసి వెళ్లండి"

"ఎందుకూ ?"

"అమ్మాయికి బట్టలు కావాలి"

"ఏమాత్రం కావాలి సొమ్ము ?"

"రెండువందలు"

"...................."

"వులిక్కిపడనక్కర్లేదు...మీ అమ్మ మల్లువంచెలు కట్టిద్దామనుకుంటోంది కాని సాగనివ్వను నేను. ఇప్పటిదాకా వుప్పాడచీరలతో వరిపుచ్చుతున్నాను ; గాని యివాళ దక్షిణాదిచీరలు కొంటాను రెండు"

"లోకం___"

"...................."

"కుల్లి చావనియ్యండి"

"మీ రాలోచిస్తూ కూచుంటే యిది తప్పేది కాదు. తొరగా లేవండి"

"మరోమాటు కొందువుగాని"

"వల్లకాదు"

"...................."

"పెట్టె తీస్తారా తియ్యరా ?"

"పదిరోజుల్లో నేను చెన్నపట్నం వెడతాను కాదూ? అక్కడ తెస్తానులే మంచిరకం"

"ఇవాళే కట్టబెట్టాలి అమ్మాయికి. నాలుగుగంటల వేళ మంచి దని చెప్పివెళ్ళారు వేంకటావధానులుగారు.

బజారుకి వెళ్లడానికి వొక బండికూడా తీసుకురావాలి నాకు"

"........................"

"పెట్టి తియ్యండి ముందు"

"పెట్టిలో మూడువందలే వున్నాయి. రెండువందల యాభై రూపాయలు చేబదు లిమ్మంటూ కొడుకుని పంపించింది మా అక్క"

"అందుకా దీక్షితులు రాకా? ఏమన్నారు మీరు?"

"అలాగే అన్నాను"

"వల్లకాదు...నాకు రెండువందలూ యివ్వాలి"

"ఇప్పటికి వొక్క వంద పుచ్చుకో"

"పెట్టి తియ్యండి చెబుతాను"

"........................"

"........................"

"........................"

"ఈ రెండువందలూ అమ్మాయి బట్టలికి. ఈపాతికా శాస్త్రిల్లుగారికి జీతం. ఈపాతికా నాకు కావాలి. ఈపదీ పాలవాడికి. మిగిలినవి—"

"ఇక నలభై మిగిల్చావు"

"నేతిమనిషీ నూనెమనిషీ రేపు వస్తారు. ఆనలభయీ వుండనివ్వండి...అన్నట్టు కాఫీగింజలూ, గోధుమనూకా అయిపోయాయి. అవి కూడా యిప్పుడే తేవాలి"

"........................"

"నేనూ అమ్మాయీ బజారుకి వెళ్లివస్తాం, మీ రెక్కడికీ వెళ్లకండి మేము వచ్చేదాకాను"

"........................"

"తాళం వేసెయ్యండి మరిచిపోక......"

* * * *

"ఈచీర కట్టుకుంటే బాగుందా నాన్నగారూ?"

"నిక్షేపంలా వుంది...ఎంత చెప్పాడు ధర?"

"ఎనభై ఆరురూపాయలు పుచ్చుకున్నాడు...దణ్ణం పెడతాను పాదా లివ్వండి నాన్నగారూ!"

".........ఎంతసేపుతల్లీ కళ్లకద్దుకోడం?"

"........................"

"ఏంచెయ్యనమ్మా నేను? పూరుకో. ఇంతే పెట్టి పుట్టాం మేము. మాఅమ్మవు కాదూ?"

"వీ-ర-భ-ద్ర-పు-రం-కా-ళ్ళ్యా-లి-నాన్నగారూ!"

"వాళ్ల జానకమ్మ కూతుర్ని తొట్టిలో పెడతారండీ"

"రాత్రికి వస్తావా?"

"చెప్పలేను"

"అయితే—మీ అమ్మకూడా వస్తుందా?"

"రాదుట"

"ఎంచేతా?"

"ఆవిడ మన స్నేహం బాగాలేదుట"

"ఏం?"

"నాయనమ్మా, ఆవిడా మాటా మాటా అనుకున్నారండీ"

"ఎందుకూ?"

"అత్తయ్యకొడుకు రూపాయలకోసం వచ్చాడుట కాదూ?"

"అవును"

"నాకూతురికి పంపకుండా చేస్తావా" అని ఆవిడా, "నాకూతురికి లేకుండా చేద్దా మనుకొన్నావా?" అని యీవిడా అందుకున్నారు"

"ఇప్పుడు చల్లారిపోయింది కదా?"

"నాయనమ్మ పెత్తనాలకి వెళ్ళిపోయిందిలెండి"

"........................"

"బండి తెచ్చిపెట్టరూ నాన్నగారూ!"

"రాత్రికి తప్పకుండా వచ్చెయ్యి తల్లీ!"

"ఎందుకండీ?"

"నువ్వు బంతిలో లేకపోతే నాకు భోజనం నయించ దమ్మా!"

"అలవాటు చేసుకోండి నాన్నగారూ"

"ఏం?"

"నేన త్తవారింటికి—"

"మాఅమ్మవు కాదూ? మాతల్లివి కాదూ? ఇ! ఆమాట యెత్తకమ్మా. మరిచిపో"

"........................"

"వస్తావా?"

"........................"

"వస్తానను"

"పదున్నర లోపున రాకపోతే మాత్రం మీరు భోజనం చేసెయ్యండి"

"ఎనిమిది గంటలదాకా కనిపెట్టుకుని వుంటాను. ఇవాళ రెండో ఆటకి సినీమాకి వెడదాం: ఏం?"

"అలాగే లెండి"

"జట్కా తీసుకురానా ?"

"ఊ"

"రానూ పోనూ అక్కర్లేదు కాదూ!"

"అక్కడ మరో జట్కా పిలిపించుకుంటాను లెండి వచ్చేటప్పుడు"

"సరే"

౫

రాత్రి పన్నెండయింది. రామబ్రహ్మం సినీమాకి వెళ్ళి అప్పుడే వచ్చాడు. భద్రమ్మ యింకా మేలుకునే వుంది; కాని మంచంమీద అటూ యిటూ దొర్లుతూ— ఏదో పోగొట్టుకున్నదానిలాగా, ఏదో కట్టుళ్లలో వున్న మనిషిలాగా అటమటించిపోతోంది. మొగుడు లోపలికి రావడం చూసింది; కాని లేవలేదు. పలకరించనూ లేదు. అతనిమీద దృష్టి వున్నట్టే లేదు. ఇదంతా చూసి దిగాలుపడి అతనే దగ్గిరికి వెళ్ళి వొంటిమీద చెయ్యివేసి పలకరించాడు.

"......అలా పడుకోండి"

"ఎందుకిలా వున్నావో చెప్పవూ ?"

"........................"

"నన్నేడిపిస్తావా!...చెప్పవూ ?"

"మీకేం యేడ్చేదాకానూ ?"

"నీకు మాత్రం యేం వచ్చిందిప్పుడూ ?"

"పుట్టిన వొక్కపిల్లా మోడయిపోయి పునూరుకుంటూ కళ్లయెదుట తిరుగుతూ వుంటే తల్లిపేనుగు కడుపెంత తరుక్కుపోతుందో మీకేం తెలుసూ!"

"నిజమే; కాని యివాళ కొత్త యేం వచ్చింది?"

"దీనికి పాత అంటూ వుందా!...వురిటిలో చచ్చిపోతే వొకటే యేడుపయిపోవును. ఇప్పు డేటుగాని కాటుంగం గొంతుకోత. నాకళ్ళు పోతే బాగుండిపోను"

"........................"

"ఆచీర కట్టుకుని, ఆనగలన్నీ పెట్టుకుని, అద్దం ముందు నుంచుని సవరించుకుంటూ వుంటే—చూడలేకపోయాను. కళ్ళమ్మట నీళ్ళు వచ్చాయి"

"........................"

"ఇక అక్కడ నుంచోలేకపోయాను. "అమ్మా వెళుతున్నానే" అని అమ్మాయి చెబితే ఎదురుగా నుంచుని "వెళ్లిరా" అనలేకపోయాను"

"........................"

"దీపాలు పెట్టాక తలనిండాపెట్టి మెడనిండా దండలు వేసి యేడుస్తూనే కళ్లనిండా చూసుకుందా మనుకుని బుట్టెడు మల్లెమొగ్గలు కొన్నాను. అంతట్లో వీరభద్రపురంనుంచి పార్వతమ్మపిన్ని వచ్చి పిలిచింది. ఆదరా బాదరా చిన్నదండ గుచ్చి తలలో పెట్టుకుని చక్కాపోయింది మాఅమ్మ. పువ్వులన్నీ అలాగే వుండిపోయాయి"

"........................"

"అది శుభకార్యంకోసం వెడుతూ వుంటే "నేనమ్మా తల్లి" నని చెప్పుకుంటూ కూడా వెళ్లలేక యింటో మగ్గిపోతున్నాను. నాబాధ మీకేం తెలుస్తుంది? కులాసాగా సినీమాకి వెళ్ళారు, నిద్రవేళకి కూనిరాగాలు తీసుకుంటూ వచ్చారు—"

"నే నెంత యేడుస్తున్నానో—"

"అమ్మతో కలిసి దాన్నేడిపించారు. నాకడుపులో రాయి పడేశారు. ఇదంతా చేశాక మీరు మాత్రం యేడవకుండా యెలా వుండగలరూ?...పోనీ, యిప్పటికేనా "అయ్యో బుల్లెమ్మ" అని దానిమీద యేమేనా ప్రేమ వుందా?"

"........................"

"చదువు కూడ మానిపించాలని—అప్పుడే మరువు వస్తుందా?"

"........................"

"అనేకమంది తమ వెధవకూతుళ్లకి మళ్లీ పెళ్ళిచేసి ఆనందిస్తున్నారు. మీరు—"

"కొంప మునిగిపోదూ?"

"పోనీ, దానిదారి నది వెళ్ళిపోయి పెళ్ళిచేసుకుం టుంది. వొప్పుకుంటారా ?"

"వొప్పుకుంటారా అంటే—"

"ఇంటికి తీసుకురానక్కరలేదు. దాని యింటికి వెళ్లినా మీరు చూడనక్కరలేదు. దానికేమీ— వొక్క దమ్మిడీకూడా పెట్టనక్కరలేదు. తన కిష్టంవచ్చిన పిల్లాణ్ణి పెళ్ళాడి కలోగంజో తాగుతూ దాని బతుకు అది బతుకుతుంది. అలాగేనా ఏర్పాటుచేస్తారా ?"

"......................"

"మంచివయస్సు వచ్చింది. ఎక్కడలేని రూపమూ వచ్చింది. చదువు వంటబట్టింది. అందచందా లన్నీ— మంచి గ్రహింపు శక్తి కలిగింది. అలాంటిపిల్లని మూల బడి యేడుస్తూ వుండ మనడం పాపం కాదూ? మనకి పుట్టగతు లుంటాయా ?"

"........................."

"మాట్లాడ రేమండీ ?"

అతను జవాబు చెప్పలేదు.

దూరాన బాజాలచప్పుడు.

"పలక రేమండీ ?" అంటూ భద్రమ్మ అతని రెక్క పట్టుకుని కదుపుతూ అడిగింది.

"అమ్మాయిని చూడాలేనూ. లోకనింద సహించా లేనూ"

"అది యింటో వుంటే చూడ్డం మానుతుందా ?"

"నే నెంత యేడుస్తున్నానో—"

"నిజంగా ?"

"........................."

"మీఅమ్మ చచ్చిన మనమడికోసం యేడుస్తోంది; కాని బతికున్న మనమరాలికోసం యేడవడం లేదు. తెలుసునా మీకు ?"

బాజాల చప్పుడు దగ్గిరదగ్గిరకు వస్తోంది. భద్రమ్మ లేచి పక్కన కూచుని అతని చెయ్యి పట్టుకుని "అది మునపటిలాగే యింటో తిరుగుతూ వున్నా న్నాళ్లూ మనకీ యేడుపు తప్పదు. మనకి కనపడకపోయినా సరే ఎక్కడో సుఖపడుతోం దంటే మన కదో ధైర్యమూ, ఆనందమూనూ. ఏమంటారూ ?"

"బాగానే వుంది కానీ—"

"ఇక కానీ యెందుకూ మరీ ?"

"అమ్మాయిని విడిచిపెట్టివుండగలమా మనము ?"

"అది కుమిలిపోతూ వుంటే—ముగ్గిపోతూ వుంటే చూడగలం. కదూ ?"

"........................."

"దేనికీ జవాబు చెప్పకపోతే యేం చెయ్యనండీ ?"

"ఇవ్వాడీ ధోరణి యేమిటి నీకూ ?"

"సింగారించుకుని యెదుట నుంచుంటే పెళ్లికూతు రులా కనపడిందండీ పిల్ల! పెళ్ళికళ—"

"నీమాటలు సరిగా వినపడ్డం లేదు. బాజాలు వెళ్లిపోనియ్యి"

భద్రమ్మ మొగంమీద వుత్సాహం అంకిత మయింది. కాని అది అతనికి కనపడకుండా ఆమె మొగం పక్కకి తిప్పుకుంది.

అతను యాదాలాభంగా కిటికీకేసి చూడగా వీధిలో పట్టపగలులాగ వెలుగు. ఆపైని మనస్సుని ఉద్రూత లూపుతూ చక్కని సన్నాయిపాట.

"ఏదో వుత్సవం మన వీధిలోకే వచ్చినట్టుంది. చూద్దామా ?" అన్నా డతను. ఆమె జవాబు చెప్ప లేదు; కాని చెయ్యిపట్టు కొంచెం సడల్చింది. అతను మంచం దిగి ఆమెని పొదివిపట్టి దింపాడు.

ఇద్దరూ అలాగే వుండి చెరో అడుగూ ముందుకి వేశారు.

సరిగా యీసమయంలో "అబ్బాయోయ్! నాయ నోయ్! కొంప మునిగిపోయిందిరోయ్! సుందరమ్మ గొంతు కోసేసిందిరోయ్!" అంటూ యేడుపూ, తలుపు చప్పుడూ వినవచ్చింది.

భద్రమ్మ మొగం వంచుకుని అక్కడే అలాగే నుంచుంది. రామబ్రహ్మం కంగారు పడుతూ తలుపు తియ్యగా గుమ్మంలో లబోలబో మని మొత్తుకుంటూ తల్లి.

"ఏమిటమ్మా ?"

"ఇంకేం వుంది నాయనా ? సుందరమ్మ—అయ్యో కిష్టప్పా"

ముసలమ్మ యేడుపు మానలేదు. రామబ్రహ్మానికి నోట మాట రాలేదు.

భద్రమ్మ యేమీ చలించలేదు.

ఒక్క క్షణం అలా వుండి తరవాత రామబ్రహ్మం ముసలమ్మతో కూడా కిందకి వెళ్ళిపోయాడు.

చూడగా వీధిలో వొక మోటారు. మోటారులో డ్రైవరుపక్కన హితకారిణీహైస్కూలు హెడ్ మాస్టరూ, వెనక వేపున వొక పెళ్ళికూతురూ, పెళ్ళికొడుకూనూ పైగా ఆపెళ్ళికూతురు సుందరమ్మా, పెళ్ళికొడుకు ఆమె గురువు కృష్ణశాస్త్రీనీ.

రామబ్రహ్మం కొయ్యయిపోయాడు.

ముసలమ్మ మోటారులోకి వురకబోయింది; గాని మోటారువక్కనే వరసగా చేతులు కలుపుకు నుంచుని వున్న విద్యార్థులు ఆమెని పట్టేసి ఆపేశారు.

వొక్క క్షణం సన్నాయిపాట నిలిచిపోయింది. అప్పుడు పెళ్ళికొడుకూ పెళ్ళికూతురూ చిరునవ్వుతో మేడమీదకి చూస్తూ నమస్కారాలు చేశారు. వెంటనే వొక లక్ష మల్లెపువ్వులు మోటారులో ఈచివరనుంచి ఆచివరికి వొత్తుగా పడ్డాయి.

పెళ్ళివారి కరతాళధ్వనులతో ఆకాశం చిల్లులుపడి పోయింది. ఉత్తరక్షణంలో మోటారు మెల్లిగా కదిలింది.

---

# భగవంతుడు

కొడవటిగంటి కుటుంబరావుగారు



భగవంతు డున్నాడా లేడా అనే ప్రశ్న అర్థం లేని ప్రశ్న. అటువంటిప్రశ్న ఎవరైనా వేస్తే నీకు భగవంతుడితో ఏమైనా వనుందా అని వెంటనే ఎదురుప్రశ్న వెయ్యాలి; భగవంతుడివల్ల కాగలపని ఏమిటని తరవాత ఆలోచించుకోవచ్చు! ఉన్నాడని గాని లేడనిగాని మీమాంస చెయ్యటం మరీ అన్యాయం; తెలియని విషయాలను గురించి ఖండితంగా మాట్లాడటం అనాలోచనపరుడి లక్షణం. ఉన్నాడని వాదించేవాళ్ళల్లో చాలామంది తమ బాధ్యతలన్నీ ఆతడి నెత్తిన వెయ్యదలచినవాళ్ళే; భగవంతుడియందు నమ్మకం లేనివాళ్లు తమ వ్యవహారాలు యావత్తూ తామే చక్కబెట్టుకోగలమనే ధైర్యంతో ఉన్నవాళ్లు.

భగవంతుడి ప్రకృతి జనసామాన్యం దృష్టిలో మారుతున్నది! భూమి అడుసుముద్దగా ఉండి జీవకోటి యావత్తూ జలచరంగా ఉన్నప్పుడు సమర్థత గల మత్స్యం ఒకటి భగవంతుడనిపించుకుంది. అట్లాగే అవతారాలన్నీ. విచిత్రమేమి టంటే ఈ భగవంతుడు మన కవపరమైన రూపంలో వస్తేనే దణ్ణం పెడతాం కాని అంతకన్న హెచ్చుమహిమతో వస్తే వాడికి మొహాన బెంద్దులే. మత్స్యావతారం కాలంలో ఏ రాముడో వచ్చి ఉంటే ఆ జలచరాలన్నీ పీక్కుతినేవే! అయినా ఇవ్వటికి అయిదువేల సంవత్సరాల క్రితం దేవుడనిపించుకున్న శ్రీరాముడి కింకా మర్యాద జరుగుతున్నది. ఈరోజుల్లో ఊరికో రాముడుండటాని కవకాశం ఉంది సరేకదా ఈ నాగరికతలో రాముడల్లే ప్రవర్తించేవాడు లోకంచేత తక్షణం బహిష్కరింప బడతాడు. ఈ పరిస్థితుల్లో మనం రాముణ్ణి ఇంకా దేవుడుగానే భావించటం అజ్ఞానం కాకపోతే తప్పకుండా ఎగతాళే! కొందరు మేధావులీ విషయమై నిజానిజాలు కనుక్కున్నవాళ్లు నిరాకారాన్ని అమల్లోకి తెచ్చారు. అటువంటి నిరాకారుడు ఉన్నాడని భావించటానికైనా కారణం కనిపించదు. ఆ నిరాకారంతో మానవుడి కేం పని? పనిలేకుండా ధ్యానం చెయ్యటంలో అర్థమేమిటి? ఏదో పొందుదామనేగా? ఏదో అవుదామనేగా? ఆ కావటానికీ పొందటానికీ సహాయభూతుడయ్యే భగవంతుడు సాకారుడు కావటం లేదా? ఒకవేళ సాకారుడు కానక్కర్లేకపోతే

ఆ పొందే దేమిటో అయే దేమిటో ఆ భక్తులకే స్పష్టంగా తెలీదన్నమాట! ఆ ధ్యానం బకధ్యానం!

భగవంతుడనే మాటలో అర్థం ఏదైనా ఉంటే సాకారుడైన భగవంతుడి యందే ఉంది. ఎవడైనా విపరీతమైన ఆపదలు ఉన్నప్పుడు మరోడు వాణ్ణి కాపాడితే రక్షింపబడే వాడి ఆపత్తుయొక్క ఎక్కువ తక్కువలను బట్టి ఎక్కువ తక్కువలుగా రక్షించేవాడు భగవంతుడి ఆకారం పొందుతాడు. ఒక్కొక సమయంలో నడివీధిలో రక్షింపబడ్డ మనిషి రక్షించినవాడి పాదాలమీద పడి అంతా మరిచిపోయి ధ్యానం చెయ్యటం మొదలుపెట్టినా ఆశ్చర్యం లేదు. అంత మాత్రానికే మనం ఆ రక్షించిన మనిషే భగవంతుడు వాణ్ణే మనం కూడా ధ్యానం చేద్దామనే బుద్ధి పుడుతుందా? ఆ మనిషికే తెలీదా తనకే ఏ భగవంతుడన్నా అడ్డపడవలసిన ఇక్కట్లు రావచ్చునని? అంతదాకా ఎందుకు? ఏ ఒకవ్యక్తి అయినా శాశ్వతంగా ప్రపంచంలో యుద్ధాలులేకుండా చేస్తే అతడు భగవంతుడుగా పరిగణించబడతాడు—తిరిగి జనసంఖ్య పెరిగి నెలకో మహాసంగ్రామం అవసరం అయే వరకూ! చూడరాదూ దశావతారాల్లో ఒక పరశురామావతారం ఒక బుద్ధావతారం, ఒక వామనావతారం ఒక కల్క్యవతారం. భగవంతుడు తనవంశంలో తిరిగి తానుపుట్టడు!

మనం నిత్యకర్మకు భగవంతుడిమీద ఆధారపడిలేం. ఎవడిచేతనో చాకిరి చేయించుకుని, నా పొలంలో పండించుకుని తినే భోజనానికి, ఇంకో దేశాన్ని దోచితెచ్చుకు తినే రొట్టెకు, ఓ భగవంతుడా నా అనుదినమైన భోజనాన్ని (లేక రొట్టెను) నా కిమ్ము అనటం భగవంతుణ్ణి ఎగతాళి చెయ్యటమో నన్ను నేను ఎగతాళి చేసుకోవటమో తెలవటంలేదు. ప్రతిపనీ చేసి కృష్ణార్పణమనటం, ప్రతిపనీ మనచేత భగవంతుడే చేయిస్తున్నాడనటం బొల్లికబుర్లు—భగవంతుడికి మనచేత వెధవపనులన్నీ చేయించటమే పనయినట్టు! ఇక న్యాయస్థానాలెందుకు, శిక్షలెందుకు, ఒకర్నొకరు వేలుపెట్టి పొడుచుకోటాలెందుకు? భగవంతుణ్ణి స్మరించని జన్మవ్యర్థమని భాగవతాది గ్రంథాలు మొదటినించీ చివరవరకూ ఒకటే ఘోష. హిరణ్యకశిపుడికంటె సమర్థుడికి భగవంతుణ్ణి స్మరించవలసిన అవసరం ఎట్లా కలుగుతుందో ఎవరైనా చెప్పగలరా? భగవంతుడే లేడని నమ్మాడంటే వాడి తప్పా? వాడు భగవంతుణ్ణి నమ్మక చచ్చాడనటం మరో ఘోరం! అనారోగ్యం వల్ల చావనివాడు ప్రమాదాలవల్ల చచ్చినట్టు సహజమైన చావు చావకుండా కట్టుదిట్టాలు చేసుకున్న జీవి అసహజమైన చావు చావటంలో వింత నాకేం కనపడటం లేదు. కాకపోతే వాడు లోకకంటకుడు కనక వాణ్ణి చంపేసిన మహామృగం ఏదైతే ఉందో అది ఏకగ్రీవంగా భగవంతుడనిపించుకుంది. ఆ ఆకారం ఇప్పుడు దిగవస్తే దాన్ని తక్షణం చంపి వినోదంగా బ్రిటిష్ మ్యూజియంలో పెడతారు. పటాలుపెట్టి గుళ్లుకట్టి దణ్ణాలుపెట్టే మహాభక్తులే ఈ వాక్య విని సంతోషిస్తారు.

భగవంతుడి ఆవశ్యకతను గురించి ఆలోచిద్దాం. మనకు చాతకాని పనికి భగవంతుణ్ణి ఎప్పుడూ పిలవం. గజేంద్రుడు—వెనకటి జన్మలో ఎవడైనా కాని—సామాన్యపు అడివేనుగు. మొసలిచేతులో చిక్కింది. యుద్ధం చేసింది. లాభం లేకపోయింది. దాని మనస్సులో ఒకవిధమైన ప్రార్థన ప్రారంభమయింది. రోజుకు నూరుచావులు తప్పించుకునే జీవికా ప్రార్థనరాదు మానసికంగా గజేంద్రుడికీ ఆపద కల్లోకూడా తలవనిది. ఇటువంటి చావుకది అంగీకరించలేదు. అందులో స్వార్థం చాలాఉంది. చివరకు దాని మోక్షంలో ఫలితానికొచ్చింది. ఆ స్వార్థమే. మొసలిని జయించేశక్తి తనలోనించి రాదని తేలిపోయింది. ఇక అది ఎక్కణ్ణించన్నా రావాలి. ఆ వచ్చేవ్యక్తి మొసలిని పిప్పి పిప్పిగా కొట్టగల ఆయుధాలు అనేకం తీసుకురావాలి. అట్లాగే వచ్చాడు. ఆ సమయాన ఏ పిట్టలను కొట్టేవాడు వచ్చి మొసలిని చంపినా ఆతణ్ణి గజేంద్రుడు భగవంతుడుగా గణించటానికి సిద్ధమే!

అన్నదానం చేసిన భగవంతుడికి కన్న ప్రాణదానం చేసిన భగవంతుడు సహజంగా ఎక్కువవాడుగా ఉంటాడు. శరీరాన్ని కాపాడుకోటానికి భగవంతుణ్ణి ప్రార్థే

యపడే కాలం క్రమంగా నశిస్తున్నది. మనస్సుకు కలిగే బాధలు వారించే దేవుడు సహజంగా శరీరాన్ని కాపాడే దేవుడికంటె తెలివిగా ఉంటాడు. మనుష్యులు క్రమంగా నాస్తికులు కావటానికీ భగవంతుడు వాళ్లకు దూరం కావటానికీ కారణం సులభంగా ఊహించవచ్చు. ఏ కష్టాలు మనకు పాతబడి పోతవో వాటిని గురించి భగవంతుణ్ణి ప్రార్థించటం క్రమంగా అనవసరమై పోతుంది. ఎప్పుడూ చచ్చేవాళ్లకి ఏడిచేవాళ్లెవరన్నట్టు హమేషా ఉండే బాధనుచూస్తే భయం తగ్గటం, ఒకటి, భగవంతుడది తీసెయ్య లేడనే నమ్మకం, రెండు! అందుకనే అప్పుడప్పుడూ వచ్చిపడే ప్లేగు మొదలైనవి దేవతాస్వరూపాలు. ప్రతిసంవత్సరం ప్లేగుతో బాధపడే నైజాం దేశమంటి చోట ఎంతకాలం ప్రార్థనచేస్తూ కూర్చుంటారు! ఇవాళ భగవంతుడివల్ల తప్ప కాని పని రేపుమనం స్వయంగా చేసుకుంటాం! గజేంద్రుడు మరి రెండు మూడు సార్లు మొసలిచేతులో చిక్కితే భగవంతుణ్ణి ప్రార్థించటం అనుమానమే అవుతుంది. ఒకవేళ ప్రార్థించినా ఆ ప్రార్థన నాలికమీదినించి రావలిసిందే! వేల సంవత్సరాలకింద మనపూర్వుల హృదయాల్లోనించి వచ్చిన ప్రార్థన మనం వల్లెవేసి, అర్థమైన చేసుకోకుండా, మన విధి మనం నిర్వర్తించినట్టు సంతృప్తి చెందుతున్నాం. అటువంటివి మనకు మామూలే. కాసీకి నిప్పుపెట్టి చిక్కేయీ రోజుల్లో నిత్యాగ్నిహోత్రి అనే మిషమీద గౌరవం పొందుతూన్నవాళ్లు లేరూ? మనపూర్వులు వేటికోసం ప్రార్థించారో వాటికోసం మనం కూడా ఎందుకు ప్రార్థించాలని ఎవరికీ ఉండదు—భజనపరుల్లో. అసలు ఉత్తభజనలో అర్థం ఏమిటి?

భగవంతుడనే వాడుండి మన అందరి మొరలూ వింటున్నాడనే గ్యారంటీ ఎప్పుడూ లేదు. అనేకమంది మాకు ఇంకా బతకాలనుందో అంటూ చస్తున్నారు. అంత మాత్రాన మనుష్యులు ప్రార్థించటం మానరు. అది అసంభవం. నిజమైన ప్రార్థన మనస్సులోనించి అప్రయత్నంగా వస్తుంది. అది ఎవరు వింటారు, కోరిక నెరవేరుతుందా అనే ప్రశ్నలుండవు. భగవంతుడు నిజంగా లేకపోయినా చెయ్యటంతప్పదు. కనక ప్రార్థన చేసినంత మాత్రాన భగవంతుడంటూ ఒకడున్నాడని రుజువుకావటంలేదు. కాని మన కోరిక నెరవేరినప్పుడు మన కోరిక ఏశక్తి నెరవేర్చిందో ఆశక్తే భగవంతుడుగా నమ్మి ధాన్యంచెయ్యటంలో ఏమీతప్పులేదు. ఎందుచేతంటె మన కోరిక ఏదైనా తెలిసినపద్ధతిగా నెరవేరేదైనా, దానియొక్క ఆవశ్యకత మనకు అంత ఎక్కువైనది కాకపోయినా మనలో ప్రార్థన బయలుదేరదు కనక. ప్రార్థన అందరూ ఒకదానికే చెయ్యరు సరేకదా ఒకరి కోకరు విరుద్ధంగాకూడా ప్రార్థిస్తారు. ఒకడు కొత్తగా వితంతువులైనవాళ్ల తలగొరుగుడు పడకుండా చెయ్యమనీ, ఇంకోడు వితంతువులజుట్టు దానంతట అదే రాలిపడేటట్టు చెయ్యమనీ! ఒకదేశం మమ్మల్ని యుద్ధంలో గెలిపించి విరోధులను చంపమనీ, ఆదేశస్థులు కూడా అట్లాగే! అదీప్రార్థనే, ఇదీ ప్రార్థనే! దుర్మార్గుల ప్రార్థనా ఫలిస్తున్నది ఫలించేటప్పుడు! శిలల్లే ఒక్కడే దేవుణ్ణిపెట్టి, ఇన్నిపనులూ వాడే చేస్తున్నాడనా?

భగవంతుడికి సంబంధించిన నిరర్థకపు విషయాల్లో—భగవంతుడియందు ప్రేమ, లేక భక్తి, అమ్మాయీల సంగతి తెలీసంతకాలం మనిష్టమొచ్చిన అమ్మాయిని ఊహించుకుని ప్రేమించటం ఎంత సులభమో భగవంతుణ్ణి ప్రేమించటం అంత సులభం; అమ్మాయిలను గురించి తెలుసుకోదగినదంతా తెలుసుకున్న తరవాత అమ్మాయీలను ఊహించుకుని ప్రేమించటం ఎంత కష్టమో భగవంతుణ్ణిగురించి తెలుసుకోటం అసంభవమని తెలుసుకున్న తరవాత భగవంతుడిమీద ప్రేమ అంత అసంభవం. "ఓ భగవంతుడా! నీతో ఆడతాను. పాడతాను. నిన్ను కౌగిలించుకుంటాను. ఓ నాథా! ఓ అదా! ఓ ఇదా!" అనే మనస్తత్వం నాతలకు మించినది.

"భగవంతుడున్నాడని సంచరిద్దాం? ఉన్నాడా? యేబ్బంది లేదు! లేడా? (జవాబుశా ఇక్కడ కన్నుకొట్టాలి!) నష్టంలేదు!" ఇదో అభిప్రాయం!—వ్యాఖ్యానం అనవసరం.

ఈమధ్య బెర్నార్డుషా భగవదన్వేషణ చేసిన ఒక నీగ్రోపిల్ల అనుభవాలను గురించి చిన్న గ్రంథం రాశాడు. బాగానే ఉందికాని ఎందుకు రాశాడో తెలీలేదు. దానిమీద ఎవరో మరో పుస్తకం రాసి అంతే ఖరీదుకే అమ్ముతున్నారట. చదవలేదుకాని బహుశా ఆకారణానికే (బెర్నార్డుషా ఎందుకు రాశాడో అందుకే!) అయి ఉంటుంది.

నేను మాత్రం ఈ వ్యాసం రాసిన కారణం దాచ దలుచుకోలేదు. మన జీవితంలో దేనితోనూ చేయబడని చీకటికి స్థానం ఉన్నట్టే అగమ్య గోచరంగా ఉన్న ఈ భగవంతుడికీ స్థానం ఉంది. ప్రతి దాన్నీ గురించి నిజానిజాలు తర్కించటం ఎంత అవసరమో దీన్ని గురించి తెలుసుకోవటం కూడా అంత అవసరం. ప్రకృతి మానవుడికి చాలా శక్తి నిచ్చింది కాని దాన్ని మానవుడు చాలా దుర్వినియోగం చేస్తున్నాడు. భగవంతుడిక్కి వది ఆకారాలు కల్పించి ఒక్కొక్క ఆకారం చుట్టూ ఒక్కొక్క మతం అల్లుకొచ్చారు. చాలాభాగం మనిషి యొక్క మనశ్శక్తి ఎవరి మతాన్ని వారు సమర్థించుకోవడంలో సరిపోతున్నది. భగవంతుడు లింగాకారమా లేక భగవంతుడికి వంగనామా లున్నయ్యా అనేదాన్ని గురించే ఎంతరాయబడ్డదో చూస్తే కడుపు తరుక్కుపోతుంది. దీన్ని గురించి అభిప్రాయ భేదంవల్ల రెండు మతాలు! మత మేమిటో తెలీకుండా ఈ విధంగా ఒకరి తలకాయ ఒకరు పగలగొట్టుకుంటుంటే అందరూ ఆలోచించవలసిన అనేక విషయాలు అట్లాగే ఉండిపోవటమే కాక ప్రమాదం జరుగుచున్నది.

మన ఆరోగ్యం, మన ఐశ్వర్యం, మన బుద్ధివికాసాలు, ఒకచెంప సారస్వతం, ఆర్థిక స్థితి, కళలు, శాస్త్రాలు, విద్య, నాగరికత ఇవన్నీ వృద్ధియే మార్గం ఏమిటి? ఈ ౧౯౩౮ లో మన కన్న ఈ విషయాల్లో ఎన్ని దేశాల వాళ్లు ఉన్నత దశలో ఉన్నారు! మనం చెయ్యవలసిన ప్రయత్నం ఏది? అది మన చేతులో ఎంతవరకుంది! భగవంతుడిమీద ఎంత భారం వేద్దాం? దానివల్ల ఎంత ఫలితం కలుగుతుంది? మనకు కావలసింది మోక్షమా! అభివృద్ధా? మోక్షం వచ్చేటంత అభివృద్ధి భగవద్భక్తితో వస్తుందని నమ్మి ఊరుకోవాలా? దాన్ని గురించి కూడా ఆలోచించి మన ఆలోచన ప్రకారం నడుచుకుందామా? ఉన్నట్టుండడం చాల సులభం. అభివృద్ధి కేవలం భజనతో కాదేమోనని నాభయం.

---

# "బ్రతుకు చీకటి"

ఉభయభాషా ప్రవీణ—ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రిగారు.



ఆ మహాపట్టణమంతా అనంతకోటి మెరవు దీపాలతో వెలిగిపోతున్నది. కాని ఆ పాడుమేడ అంతే—మూడం స్తులలోను మిణుగురంత దీపకళికఅయినాలేదు. వినిశ్చల సమాధి—నిబిడయోగముద్ర— ఆ తమోమయ హృదయంలో ఏమేమి తలపోసికొని— కలవరించుకొని వెచ్చగా నిట్టూర్చుతుందో పాపం! ఆశిథిల సౌధం.

దానికి ఎదురుగా పెద్ద వేపచెట్టు కొమ్మలకు తగులుతూన్న చిన్నమేడ మాది. మా మేడగదిలో ఉంటే ఆ పాడుమేడ ఆపాద మస్తకం కనిపిస్తుంది.

ఒక జమీందారు ఒకప్పుడు ఆ మేడను దివ్యముగా అలంకరించి అందులో మహాభోగములు అనుభవించాడట. అదే మేడలో ఇప్పుడు గుడ్లగూబలు యథేచ్ఛగా గూళ్లు కట్టుకొన్నవి.

కింది అంతస్తు ఎడమచేతి వెంపు మూలగదిలో కటిక చీకటి కోణంలో అతడెవరో ఒక్కడూ మూర్తీభవించిన ఆశాభంగంవలె నివసిస్తున్నాడు. అతనికా నిరంతర సమాధి ఎందుకో తెలియదు. అతని కోమల జీవితం ఇంత దుఃఖభరితం చేసి ఎవరు పాపం కట్టుకొన్నారో—

అతని అపవృత్తికి మోక్షంలేదు. అతని మనస్సునకు శాంతిలేదు. అట్లా తన యౌవనం వికాసం—ఆత్మశక్తి—వ్యర్థమై పోతూ ఉంటే తృణప్రాయంగా లెక్కచేయక ఒక గంభీర విషాద గీతికవలె ప్రపంచానికి అర్థం కాకుండా అందులో బతుకుతున్నాడు.

ఒకనాడు—

బహుళపక్షపు వెన్నెల రేక రేకగా అతని గది కిటికీ మీద పడుతున్నది. ఎప్పుడూ తెరచి ఉంచని ఆ కిటికీ తెరచి ఉండడంవల్ల వెన్నెల గదిలో చీలికలుగా లేత మొగలిపూలవలె చెదరి ప్రాక సాగింది. జన్మఖైదు అనుభవిస్తున్న ఖైదీవలె కిటికీ ఊచలు పట్టుకొని తెల్లని మబ్బు తిప్పలను దాటుతున్న అర్థచంద్రుణ్ణి— వెండి తలలతో గాలికి రవంత ఊగుతున్న కొబ్బరిచెట్లను చూస్తూ—

"ఇల్లో ముంగిలియో అనుంగు చెలులో
ఈడైన చుట్టంబులో
ఇల్లాలో కొడుకో తిరింప వశమే
యే పోడుముల్లేక—"

అని ఆవ్యథా భరితమైన హృదయం చీల్చుకొని పాడుకొంటున్నాడు.

రాత్రి 11 గంట లవుతుంది. బాటలో మనుష్య సంచారంలేదు. దూరంగా సినీమా ఇంజను చప్పుడు. ఆవేళ ఏదో ఇంగ్లీషు 'ఫిలిం'ట ఆయన వెడుతూ "పద్మా! ఈ ఫిలిం ఎంతో బాగుంటుంది. నువ్వూరా" అని ఎంతో పట్టు పట్టారు గాని ఆపాడు ఇంగ్లీషు నాకర్థం కాదని నే వెళ్లలా.

సినీమా రెండవ ఆట ముగియడాని కింకా గంటన్నర ఉంటుంది. ఏమీ తోచకపోతే నిలువుటద్దం దగ్గర నిలుచుని జార్మాజడలో అర్థచంద్రాకారముగ అమర్చిన సన్నజాజి పూలదండ వంకరలు—కెంపో సిలుకు జాకెటు ఉగ్గులు—లేతమబ్బురంగు చీర ముడతలు పొళ్లుపైటపిన్ను పద్ధతి సర్దుతున్నాను. తాంబూలరేఖా రంజితమై తేన పెఱవలే మాధుర్యం చిమ్ముకొనే నామెత్తని పెదవులు చైత్ర మాసపు తియ్యమామిడి చిగుళ్లవలె నిగనిగలాడే నా చెక్కిళ్లు నాకేదో ఉత్సాహాన్ని పురికొల్పినవి. నా సౌందర్యామృతమునకు నేనే అప్సరసను. అంతే—ఆయన గంధర్వుడు కాడు. ఈ ఊర్వశీ విలాసములకు విచ్ఛిత్తి విశేషములు చూపలేదు. ఈ నందన పారిజాత మును కళ్ల కద్దుకొనలేదు. ఇట్లా ఏదో ఆలోచనలో అక్కడే నిలుచున్నాను.

* * * * *

"ఓ నవనీత కోమల వరోరు చిరాంగి యనుగ్రహింపు"

వెన్నెల వెండి పూతలో మెరిసే నిశ్శబ్ద విశ్వాన్ని చీల్చుకొని సన్నని కేదారగౌళ రాగంలో ఆ గీతం అతని గది కిటికీనుండి వస్తున్నది. ఉలికిపడి కిటికీదగ్గర తొంగిచూశాను. వికసించిన పారిజాతం తీవ్ర వాసనకి మల్లే ఆ రాగవాహిని నన్ను అరికట్టింది.

"కట కట నా చరితము కర్ణకఠోరము ఎటుల బ్రోతువో తెలియ"

అతని జీవనభారం ప్రతిపాట మలుపులోను తొణికి పోతూన్నది.

'లావొక్కింతయులేదు' అనే ఆ క్రోశధ్వని అక్షరం అక్షరంలోనూ ఖంగున మ్రోగుతున్నది.

అతని ప్రమాదకరమైన బ్రతుకులో నాకేదో బీభత్స దృశ్యం పొడకట్టింది. ఇక ఒక్క నిమిషం ఆలస్యం చేస్తే అతడు ఆత్మహత్యకు సిద్ధంగా ఉన్నట్టు తోచింది. అయ్యో! పాపం అతని చిల్లులు పడిన హృదయానికి ఎవరు అభయం ఇస్తారు? అతని కారుబ్రతుకు చీకటిలో ఎవరు దీపం వెలిగిస్తారు?

కొండ లోయలోని మధుర వేణుగానంవలె అతని హృదయ మాధుర్యం ఎవరికీ కొఱగాక నశించి పోవల సిందేనా?

నా శరీరం ఆపాదమస్తకం ఉడికిపోయింది. అతని దగ్ధజీవితంలో మంచు జడులు కురిపించాలి అనే నిశ్చయం నా చెవులలో రింగుమంది. గది తలుపులు మూసి గబ గబ మేడమెట్లు దిగాను.

పెరటిగుమ్మాన్ని అతనిగది తలుపు దగ్గరకు వచ్చి వణుకుతున్న వేళ్ళతో తలుపుమీద కొట్టాను. అతడు మెల్లగా పాట ఆపి తలుపుతీసి నిర్ఘాంతపోయాడు. సలసల కాగే అతని హృదయ కటాహంలో ఒక్కసారి హిమ బిందువుల చిలకరింపు—కొంతసేపటికి అతడు తేరుకుని ఈ సంవిధానం నిజమా—కాక నిదుర యెరగని నా వేడి రెప్పలకు ఇంత అమృతస్వప్నం కలగడం మాత్రం సంభవమా! అనుకున్నాడు. ఏదీ నమ్మలేక అతడు ఉవ్వెత్తుగా తన జీర్ణ తల్పంమీద ఒరిగి పోయాడు ఆ తొందరలో అతని కుడిచేతిలో దాచుకున్న చురకత్తి టక్కున కిందపడింది. వెంటనే నాగుండెలు నిలిచిపోతా యనుకున్నాను. ఇంత దారుణానికి ఇతడెందుకు పాల్పడుతున్నాడు, ఇదీ నా తీరనిప్రశ్న. కత్తి దూరంగా పారవేసి అతని దగ్గరకువెళ్ళి "మీవంటి పురుషులే ఇంతటి హేయమైన పనికి పూనుకుంటే స్త్రీలమాట చెప్పవలెనా—ఇంత తరుణ వయస్సులో మీవంటి యువకులు దేశకల్యాణమునకు — జాత్యుద్ధరణమునకూ పూనుకోవాలి గాని ఇట్లాంటి అవమాన కరమయిన మరణాలకు పాల్పడవచ్చునా? చావునకు మాత్రం గౌరవం అక్కరలేదా? దేశాంతర యువకులు శత్రువుల గుండెలలో గ్రుచ్చే కత్తులు మీరు మీ హృదయాలమీదే పరీక్ష చూస్తున్నారా? ఇట్లాంటి పనులు జాతినంతటినీ నీచపరచవా, అన్నాను గుక్క తిప్పకుండా, అతడు కన్నులు తెరచి కూరుచున్నాడు. వెన్నెల కాంతిలో స్పష్టంగా కనిపించే నా ముఖం నిదానించి చూసి త్రుళ్ళిపడి 'పద్మావతీ' అన్నాడు—ఎవరతడు అయ్యో! మా, వేణు—వేణూనీవు— నీవేనా—ఇట్లా సాహసించి చచ్చిపోదలంచింది! వెక్కి వెక్కి ఏడుస్తూ అతడు నా చేతులలోకి వాలిపోయాడు.

ప్రపంచాన్నంతటినీ ఏదో అడిగి అడిగి మోడువారిన చేతులతో నన్ను గట్టిగా కౌగలించుకొని తల్లిలేని బిడ్డవలె నా వక్షఃస్థలానికి అంటుకుపోయాడు. ఒకప్పుడు గౌరీమనోహరం తీగల్లో దాగుకుని ఒకరి జుట్టులో ఒకరం పువ్వులు పెట్టుకుని ఒకరిమీద ఒకరు ఒరిగి నిద్రపోయిన రోజులు జ్ఞాపకం వచ్చాయి. నాకు కూడా ఏడ్పు ఆగలేదు. తెగిన ముత్యాలదండవలె దొంతరగా రాలే కన్నీళ్లు చిమ్ముకొని "వేణూ! భగవంతుడు మన ఇద్దరికే సంతోషంగా ఆజన్మాంతమూ అనుభవించమని ఇచ్చిన నిబిడ దుఃఖం దుర్వ్యయం చేసుకోవద్దు. ఈ ఆశాభంగాగ్నితో కాలి మసి ఐపోదాం. చచ్చిపోవద్దు. అది చేతకానిపని. నా భర్తను ఎరుగుదువు గదా—కలెక్టరాఫీసు గుమాస్తా, ఆస్థూలకాయం—కళ్ళజోడూ—సేలంఖండ్వా—ఏమైనా పవిత్రముద్రలతో మా అమ్మా అన్నయ్యా, మొదలైన నా శ్రేయస్కాములైన పెద్దలు ఆ 'ఒరాంగుటాంగు'తో నాకు కాపురం విధించారు. అంతే అదేమిటంటే?—అవినీతి—పెంకెతనం—వ్యభిచారం—ఇన్ని తలమీదకి సిద్ధం—అయితే నేను ఆడదాన్ని అస్వతంత్రురాలను. నీవు మగవాడవు స్వతంత్రుడవు. అన్యాయ్యం ధిక్కరించగలవాడవు. నీకే ఆశాభంగం ఏమిటి? నీకీ గుడ్లగూబ బతుకెక్కడ దాపురించింది," అన్నాను. అతడు గొంతు సరిచేసుకుని చూపు సవరించుకొని ఇట్లా అన్నాడు. "పద్మా! తెల్లని చుక్కలు కుట్టిన నల్లని ఆకాశం క్రింద మనం కథలు చెప్పుకుంటూ ఒకే మంచంమీద పండుకొన్నప్పుడు నేను చెప్పిన మాటలు తలుచుకుంటే సిగ్గుతో కుంగిపోతాను. అప్పటి ధైర్యం—చొరవ—ఉత్సాహం—నాలో క్రమంగా పోయినవి. పెద్ద చదువు చదివాను—ఎన్నో ఉపన్యాసా లిచ్చాను. ఎన్నో పత్రికల్లో నేను వ్రాసిన వ్యాసాలు, గీతాలు, దేశమంతా మారుమోగాయి. కాని ఏదో అసంతృప్తి—వేదన—చెప్పలేని బాధ — చంద్రుణ్ణీ—పువ్వులనూ—గోదావరినీ—ఆకాశాన్నీ చూస్తూన్నప్పుడల్లా ఏదో ఉద్రేకం—అశాంతి—ఇట్లా ఎన్నోరోజులు గడిపేశాను. ఒకనాడు మా పెరటిలో అరటిచెట్లూ జామిచెట్లూ గుబురుగా ఉన్నచోట సాయంత్రం ఏదో పాడుకుంటున్నాను. నా కూర్చున్నచోటికి కుడిచేతివెంపు మల్లెపొద దగ్గర ఎవరో కదిలినట్టుంది. నేను వెనుదిరిగి చూసేసరికి ఆమె ఒక యువతి. చేతిలో బిందె ఉన్నది. ఒకటి రెండు మల్లెపూవులు మాత్రమే కోసి ఆమె జుట్టులో పెట్టుకుంటున్నది. నాపాట వింటూ అక్కడ ఎంతో సేపటినుంచి నిలిచి ఉంటుంది. నేను నిదానించి ఆమెన

చూచి ఆమె మెత్తని మనస్సును నొప్పింపదలచుకోలేదు కాని ఆమెయే నావైపు వస్తున్నది నూతిదగ్గరకు. ఆమె వయస్సు సుమారు పద్ధెనిమిది కావచ్చు. సౌందర్యవతి. వెళ్లుతూ దీనంగా భయంగా అడలేడిపిల్లవలె నావైపే చూస్తూ నూతివెంపు వెళ్లింది. ఆచూపులో నా కేదో ఆహ్వానం గోచరించింది. నాకళ్లముందున్న పొర ఏదో జారిపోతున్నట్టనిపించింది. సిగ్గులో నేనే తలవంచుకున్నాను. అన్యాయమేమో అనిపించింది. ఇట్లా చాలా రోజులు ఆమె నీళ్లకు వచ్చేవేళ—నేను అరటిపొదలదగ్గర పాడుకొనేవేళ.

నాగస్వరమునకు చొక్కి తలఊపే నాగకన్యక వలె ఆమె నేపాడినంతసేపూ ఆ నీలిగోరింటపూలవంటి కళ్లను కదల్చకుండా నివ్వెరపడి పొదచాటున నిలుచుని నాపాట వినేది. ఆమెను చూచినప్పుడు నా రాగవాహిని మందాకినివలె ప్రవహించేది. అప్రయత్నంగా ఒకరిని చూచి ఒకరము నవ్వుకొన్నాం. ఆస్నేహము నిబిడమయి పోయింది. ఆప్రేమ గాఢమై సాగింది. నే నంతకాలమూ ఎందుకోసం దిగాలుపడి కూచున్నానో తెలియవచ్చింది. నా కేమి కావాలో అర్థమయింది. నా కుంగిపోయే అంతరాత్మకు ఆలంబనం దొరికింది. అంతటినుంచి నాముఖములో ఒక కొత్తవికాసమూ నామాటలలో ఒక కొత్త మార్దవమూ, నావ్రాతలో ఒక కొత్త ఆర్జవమూ ఉప్పతిల్లినవి. అంతటినుంచి చెప్పినదే ఉపన్యాసము. అప్పటినుంచి వ్రాసినదే పద్యం. ఆ ఉత్సాహంతో, దేశమునకు, వాఙ్మయమునకు వీరేశలింగంవలె అనితరసాధ్యమైన సేవచేసి ఉందును. జగన్నాధరావు సరసుడు. ఆయన చెల్లెలు అధర్మంగా ప్రవర్తించదని ఆయన నిశ్చయం. ఆమె వితంతు వయినప్పటినుంచి ఎంతో చదువు చెప్పించాడు. సంగీతం చెప్పించాడు. నేనంటె ఆయనకు అయిదు ప్రాణాలూను. ఊర్మిళ నాతో మాట్లాడితే—వాదిస్తే—ప్రశ్నిస్తే,ఆయనకు బ్రహ్మానందం. మా ప్రేమకు ఇట్లాంటి స్వేచ్ఛావాతావరణం కూడా దైవకృపవల్ల లభించింది. కాని—ఒకనాడు మా యిద్దరిమీద పిడుగు పడింది. అగ్నిపర్వతం అనంతజ్వాలలతో మా మీదకు ఒరిగింది.

మా పెరడులో మల్లెపొదలదగ్గర నించుని ఊర్మిళ పచ్చని ఆకాశం వేపూ తొగరుమబ్బుల వేపూ చూస్తున్నది పరాకుగా. నేను వెనకాతలే వెళ్లి కళ్లుమూసి ఎవరువారు? అన్నాను. నామృదుహస్తస్పర్శకు ఆమె కరిగి నా వక్షఃస్థలం మీదికి ఒరిగింది. నేను గాఢంగా నాహృదయానికి అదుముకున్నాను. వెంటనే మా డాబా మీదనుంచి "బాగుంది నాయనా కొంపకు ప్రతిష్ఠ తెచ్చే పనులే చేస్తున్నావు". ఇద్దరమూ దద్దరిల్లి పోయాం, ఆమె ఆ అవమానంతో తల వంచుకుని తిరిగి చూడకుండా ఇంటికి వెళ్లిపోయింది. నేను నిర్విణ్ణుణ్నయిపోయి నాగదిలోకి పోయాను. పద్మావతీ నీవు పెద్దింటి బిడ్డవు. నీ కిట్లాంటి కథలు కంటకంగా ఉంటాయి—అసహ్యం కూడా—కాని అభివృద్ధిలోకి రావాల్సిన ఒక ఉత్తమ వ్యక్తి ఎట్లా సంఘం కోసిన కోతవల్ల—పెట్టిన వాతవల్ల క్రుంగి పోయిందో అర్థం చేసుకో.

కడుపున పుట్టిన ఆడపిల్లల్ని వందలువందలికి అమ్మజూపితే తప్పులేదు—కొడుకు సీమవెళ్లి, కుక్క నాలికలు, గొడ్డు కొవ్వులు తిన్నా మన దేవతార్చనపరులకి పనికి వస్తుంది—వితంతువు త్రికి ఆగలేక...ఎన్ని భ్రూణహత్యలు చేసినా ఏకాశి—ఏకాశి, ఉపవాసం ఉండి కార్తీక స్నానాలు చేస్తే శుద్ధి. అంతే గాని—స్పష్టంగా ఒక యువతి, యువకుడు ప్రేమించుకుని పెళ్లి చెయ్యమని అడిగితే—వల్లకాదు. అది, కాని పని—వేదంలో చెయ్యమనిలేదు. అడ్డమైన మాలకూళ్లూ తిని వచ్చిన అల్లుడు సాలగ్రామ తీర్థం తీసుకుని సహపంక్తిని కూచోవచ్చునని వేదం చెబుతుంది. కాదూ? ఎన్నాళ్లకైనా ఈసంఘం కుంకటివేళ్లతో నశించిపోవాలి. సంఘం ఎలా ధ్వంసం అయిపోడానికి వీలుంటుందో ఆనూత్రాలు వెతకాలి యువకులు.

నీతీ జాతీ మళ్లా కృతయుగంనాడే మొదలు పెట్టాలి. ఏమైతేనేం—ఊర్మిళకి నాకూ—మధ్య నల్లతాచుపాములు బుసకొట్టాయి. మా చిన్నకయ్య నాకో జోగమ్మ అనే అమ్మాయిని పట్టుబట్టి పది రోజులలో చేయించింది. పెళ్లి అయిదురోజులూ నాకు 104 డిగ్రీల జ్వరం. నాకు స్మృతి లేనప్పుడు ఏది ఎలా జరిగినా అంతబాధగా లేదు. అయిదోరోజు రాత్రి కొంచెం జ్వరం తగ్గింది.

ఒంటరిగా పెళ్లివారి అరుగుమీద కూచున్నాను దేన్నో తేరబడి. జోగమ్మ నన్ను చూడకుండా వచ్చి అక్కడే వెనుదిరిగి కూచుంది. ఇలాయిబుడ్డి భగభగ వెలుగుతోంది. ఆ వెలుగులో ఆమె చింతాకులవంటి కళ్లు, అంగుళన్నర జడ—అందానికి ఆమడదూరంలో ఉన్న కోతిమొహం—చూసి ఒళ్లు భగ్గున తగులడిపోయి ఒక్క-తాపుతో శ్రీవారిని కిందికి దింపుదామనుకున్నాను. ఈమె నా భార్యట. ఛీ! ఛీ! ఈ అవమానం భరించను. అగ్ని పర్వతపు 'లావా' తాగమంటే ఇంతకన్న సంతోషంగా 'కప్పు'లకొలది తాగుదునే. కాని—తప్పెవరిది!!! పాపం ఎనిమిదేళ్లపిల్ల ఏ మెరుగును! ౨౨ ఏళ్లవాడవు నీవే అధర్మాన్ని ఢీకొనడానికి వెరచి ఒదిగితే ఆపసిపాప ఏమి చేస్తుంది అని అంతరాత్మ బోధించింది. జాలివేసింది ఆమె మీద—"అయితే జోగమ్మా! ఆ యిలాయిబుడ్డిని ముట్టుకోగలవా, అన్నాను గంభీరంగా, జోగమ్మ త్రుళ్లిపడి 'ఛీ అసాయం' అని తిప్పుకుంటూ లోపలికి వెళ్లిపోయింది.

నాడుమొదలు ఉపన్యాసపీఠం ఎక్కలేదు. కలం కాగితం తీసుకోలేను. ఎవ్వరితోనూ నవ్వుతో మాటాడ లేదు.

నాకు ఈఊరిలో ఒక స్నేహితుడున్నాడు. అతనికి నా రచనలమీద చెప్పలేనంత ఆదరం. నాప్రమాదకరమైన అవస్థచూచి, నా పతితజీవితంచూసి జాలిపడి అప్పుడప్పుడు నన్ను చూస్తూ, కావలిస్తే డబ్బూ, మొదలైనవి ఇస్తూఉంటాడు. అతడు ఈవేళ ఇక్కడికి వస్తానని చెప్పాడు. కాని అతనికి యజమానులు లేకపోవడంచేత అన్నిపనులూ తనే చూసుకోవాలి. ఏ పని తొందరలోనో ఉండి రాలేకపోయాడు. అతని చక్కని నవ్వుమొహం చూసినప్పుడు ఈప్రపంచంలో ఉండడంలో ఏదో సుఖలేశం ఉన్నట్టనిపిస్తుంది. ఎదుటి మేడమీద మెరుపుతీగలాగ, ఉమాసుందరిలాగ, తుమ్మెద రెక్కలాంటి విలాసంతో తళుక్కున మెరసే నిన్ను చూసినప్పుడు చచ్చిపోతే ఎలాగనిపించి నాలోకునికిపోయే ఉత్సాహశక్తి విజృంభించి, సౌందర్యదాహం నలిపివేస్తుంది. పద్మా! ఇక నేనెందుకు బతకాలో నాకర్థంకాలేదు. నాచోటు ఖాళీచేసి ఒక ఉత్తమవ్యక్తికి అవకాశం చూపుతాను. భగవంతుని విశ్వకోశంలోని ఒక నిరర్థకపదాన్ని తుడిచివేస్తాను. అని ఉద్వేగంగా వెక్కి వెక్కి ఏడుస్తూ ముఖం తిప్పేసుకున్నాడు. నాకప్పుడు హైందవయువకుల స్థితి సోదాహరణంగా అర్థమయింది. వార్తాపత్రికల్లోని 'ఒకయువకుని దుర్మరణము'లకు వ్యాఖ్యానం కనపడింది. ముందతనిమీద జాలివేయుటకు మారుగా కోపం వచ్చింది. అణచుకొని అతనిముఖం నావైపుకిప్పి 'వేణూ! భారతదేశంలో యువకుడనేమాటకు యువతి అనే అంత్యార్థం అని ఇంతవరకూ నాకు తెలియదు. నిక్షేపం లాంటి ప్రతిభను ఒక్కసారి గంగలో కలిపేశావోయి! నీ జాతీయవ్యాసాలు, విమర్శనలు చూసి ఆహా నా స్నేహితుడు కొంచెంరోజుల్లో గోఖలేఅంత వాడవుతాడని ఉప్పొంగిపోయి ప్రసంగం వచ్చినప్పుడు ఇతడు నా స్నేహితుడనిచెప్పి గర్వంగా చూసేదాన్ని. ఎప్పుడూ అయోమయప్రణయగీతాలు అడ్డమైన పత్రికలలోనూ వేశావో దానితో మనవాడు పిట్టతల వేశాడని కుంగిపోయాను. ఏమైనా ఈ "ప్రణయజబ్బు" పట్టుకుని చాలామంది తెల్లమొహాలు వేశారోయ్ పెళ్లిలమను కని. ఇంతమందిలోనూ నిజమైన ప్రేమయాతనలో 'భవభూతిలాగ—డేంటే' లాగ తిప్పలై పద్యాలువ్రాసిన వారు నిక్షేపం లాగే ఉంటారు. మధ్యవాళ్ళవే వెర్రిమొహాలు. ఇన్నెందుకు—ఒక్కటి చెబుతాను—వినవేణూ!—ఆయన సినీమానుంచివచ్చే వేళయింది. సృష్ట్యాదినుంచి ఇంద్రియనిగ్రహమునకు—మనస్థైర్యమునకు పేరెక్కిన భారతభూమిలో పుట్టి అందని ప్రేమకోసం చెయిచాచి బ్రతుకంతా బూడిదపాలు చేసుకోకండి. ప్రేమ దొరకకపోతే పవిత్రమైన బ్రహ్మచర్యం అవలంబించదేశానికో, వాఙ్మయాభివృద్ధికో దాస్యవిముక్తికో ఉపయోగించు అని లేచి నించున్నాను. అతడు హఠాత్తుగ నా పాదములమీద వాలి 'అమ్మా! నేను నా బ్రతుకు చీకటి'లో విద్యుద్దీపం వెలిగించి. నా తమోమయదృష్టికి దివ్యమార్గం అగుపడింది. స్త్రీ, తల్లిగా తోబుట్టువుగా భార్యగా భగ్నజీవితం ఉద్ధరిస్తుంది. అన్నాడు గంభీరంగా.

---

# ఒక సంభాషణ శకలము

[శ్రీరంగం శ్రీనివాసరావుగారు [కవితాసమితి]

"అయితే కవీ! నీ ఋషులెవ్వరు ?"

"Charles Bandelaire, guy de Maupassant Edgar Allan Poe!"

"వీరేనా ప్రపంచంలో కల్లా నీకు కనపడ్డవారు ?"

"నా కళ్లకు, ఇతరులు, మహాత్ములు కలరన్నమాట యథార్థం. కాని నా కావ్యజీవితాన్ని ప్రోదిచేసి, నా ఆదర్శాలను మలచిన ప్రముఖులువీరు."

"వీరిలో ఉన్న, నిన్నాకర్షించే మహాత్తేమిటో చెపుతావా ?"

"పోయిట్రీ. కవితయొక్క పరమ స్వరూపము. విశ్వరూపము వారి రచన. కాబట్టి వారు నాకు ఋషులు"

"మరి షేక్స్పియర్ ? తిక్కన ?"

"వందనార్హులు. కాని నా కక్కరలేని బోలెడుచెత్త వ్రాశారు. షెల్లీని కూడా ఇందుకే నా ప్రవృత్తి స్వీకరించదు. నిజంగా కేవలం కవి అనడానికి తగ్గవ్యక్తి ఎవడేనా ఉన్నాడా ఉంటే మనలో శ్రీనాథునివలె ప్రాశ్చాత్త్యులలో షెల్లీయే కవిపిస్తాడు. కాని షెల్లీలో కవిత్వమే కాకుండా మరేవో కూడా ఉన్నవి. ఇవి చాలామందికి కావలసినవే అనుకో. నా కక్కరలేదు. ఉదాహరణ : అతని కొన్ని జీవనసిద్ధాంతాలు."

"అన్నట్టు శ్రీనాథుడో ? అతడు నీ ఇష్టదేవతకదా!"

"కాదనలేదే. ఇష్టదేవతకీ ఋషికీ భేదం ఉన్నది. అక్కడ ఆరాధన. ఇక్కడ అవలంబన, నా ఆశయాలలో శ్రీనాథుని ప్రోద్బలం ఎక్కడాలేదు. అంటే యుగాలనుండీ పంచుకున్న ఆంధ్రరక్తం మాట అటుంచి, మరి నా ఋషిత్రయం వల్ల కవిత్వం యొక్క విశిష్టస్వరూపం నా కవగాహన అయింది."

"ఇది ప్రమాదపు సిద్ధాంతం కాదూ ? దీనివల్ల తేలేదేమంటే వీరిదే కవిత్వమనీ తదితరమంతా కాదనీ కదా ?"

"వీరిది మాత్రమే అని నే నంటేను అది. కాని నేననేదేమిటి ? ఇంతవరకు నా సంస్కారానికీ, ఊహా విధానిక గోచరించిన కావ్యరూపానికి ప్రోక్తలు వీరు. మున్ముందు వైశాల్యమూ వికాసమూ హెచ్చి క్రొత్తఋషుల పరిచయంగాని, ఉన్నవారి రచనలే క్రొత్త దృక్పథంలో గోచరించడం గాని జరిగితే అప్పుడు నా గీతం వేరుశ్రుతిలో వస్తుంది. నేను చెప్పినదంతా 'ఇప్పుడు'లో జీవిస్తుంది కాని దీనికి భవిష్యత్తు బాధ్యతలేదు."

"అయితే కవిత్వం అంటే ఏమిటి నీఋషులప్రకారం"

"అతుది మూడుమాటలూ కలపకు. కలిపితే 'వారు వ్రాసినవ్రాత సమస్తం' అని జవాబు చెప్పవలసి ఉంటుంది. నాకు నిజమైనా నీకు మాత్రం అది పెడసరంగా కనబడవచ్చు."

"అదుగో నీలో ఒంటికంటి చూపు బయల్దేరింది. అది కూడదు, ఇంగ్లీషులో గొప్ప నవలలు మూడింటిని చెప్పమంటే ఒక విమర్శకు డన్నాడట "any three novels by Joseph conrad" అని, ఏకైక పక్షపాతం అది. మరోప్రక్కకు చూడనివ్వదు, వాఙ్మయంలో అట్టి మతాభినివేశం పనికిరాదు."

"నన్న bigot అని ఎవరూ అనలేరు. ఎవరు ఏది ఎలాగు వ్రాసినా దాన్ని నేను ఆస్వాదిస్తాను. కాని అభిప్రాయాలూ నమ్మకాలు ఉండకపోవడం ఎలాగు ? అభిరుచి వైశిష్ట్యం అంటే. ఆంధ్యం అనవచ్చునా ?"

"దారి తప్పిపోతున్నాము. ప్రస్తుతం కవితనుగూర్చి చర్చ, ఏదీ Edgar Poe కవిత చూదాం. Raven, Helen, Annabel Lee తప్ప చెప్పుకో దగ్గదేమున్నది అతనిరచనలో, Bells అనే చప్పుడు వ్రాత మినహాయిస్తే ?"

"'Heard melsdies are sweet, but those unheard are sweeter!' జీవితపరిస్థితులు వ్యతిరేకించి కథలు వ్రాసుకోవలసి వచ్చింది కాని లేకుంటే నా అభిమానమైన కావ్యజీవనం చెయ్యవలసిన వాడినని ఒకచోట వ్రాశాడు Poe. ఆతని సిద్ధాంతాలన్నీ ఇప్పుడిప్పుడు లోకం గ్రహించ గలుగుతున్నది. వాటి దృష్టిలో చూస్తే అతని గీతాల్లో ప్రతిపదం రసబంధురం. నిజానికి ప్రతి అంగుళం కవి యెవరంటే Poe అని నే నంటాను. అతడు వ్రాసిన దెంత తేజోమయమో తెలిసిన పిమ్మట అనుకూల పరిస్థితులలో ఇంకా ఏమి వ్రాసి పోయే వాడో అన్నది

తూచించుకుంటే గుండెలుజల్లుమంటున్నవి. వాటికోసమే నా తహతహ! Poe గీతాలు నీవు పేర్కొన్నవి గొప్పవే. Anthologist కి కావలసిన ఉపజ్ఞతో ముఖ్యమైనవి వరగలిగావు. కాని ఇంకా Ulalume, Eulalie, (ఈపేరులు నాలుకపై కరిగిపోతాయి!) To Annie ఇవన్నీ పరిగణించావా? నీవన్న Annable Lee లో ఒక్కతుది స్టాంజా మాత్రం మహిమగలది. దానికంటె Annie గీతంలో సమగ్రతర సౌందర్యం ఉన్నదంటాను. మొత్తంమీద Poe కావ్యరచన లన్నింటిలో ఒక అతీత మహాన్మున్నది. దాన్నందుకోదగిన ఇంద్రియాలున్న వారికి అందులోని గంధర్వ సంగీతం అనుభవానుభూతం"

"Verbal music కి Swinburne నే చెప్పాలని మెప్పుడో అన్నావే. మరిదేమిటి?"

"నిజమే. సంగీతపుహాయి చెప్పవలసినప్పుడు Swinburne నే స్మరిస్తాను. ఇది నువ్వు కొట్టి పారేస్తున్నట్టు కేవల Verbal music కాదు. భావసౌందర్యములేని కృతకపదాల కూర్పుకాదు అతని సంగీతం పదాలలోంచి బయల్దేరే భావాలగానం. నిజానికి నా ఋషుల్లో Bandelaire ని మాని Swinburne నే చెప్పిఉందును. కాని వేద్యంకంటె అవేద్యపు సుఖం ఎన్నాకర్షిస్తుంది. Bandelaire ని తర్జుమాలో చదవడంచేత వ్యక్యావ్యక్తంగా అవగాహనమయ్యే అతని ప్రతిభ, దానివల్ల జనించే ఉత్సాహం ఒకవేళ తెరనడలితే పోతుందేమో. Swinburne గురించి ఎంతో తెలుసు. Too much కూడా నేమో! (టూమచ్ అన్నది నా తత్వంలోనే లేదుకాని) అతని ఆకారం స్పష్ట ప్రతిమ. Bandelaire మాత్రం మాఘపూర్ణిమలో మంచుతెరల సోయగంతో నన్నాకర్షిస్తాడు. అతని కవితకు నేను లొంగినకారణం అది"

"అంటే నీకు ఫ్రెంచిరాకపోయినా దబాయిస్తున్నావన్నమాట"

"ఎంతమాత్రం కాదు. ఫ్రెంచి నాకురాదు వాస్తవమే! కాని ఇదివిను. సంస్కృతంకూడా నాకురాదు. అయినా కాళిదాసు శాకుంతలం ఇంగ్లీషులో చదివేను. మేఘసందేశంలో, కుమారసంభవంలో వ్యాఖ్యానాల వల్ల పిండబడ్డ కవిత్వమంతా నారకంలో ప్రవహిస్తున్నట్లు నా నమ్మకం. అలాగే Bandelaire "అపుష్ప సూనా" (Fleurs du Mal) అను తర్జుమాలోనే—అదైనా పూర్తిగా కాదు, చదివాను. ఈ అసమగ్రతలోనే ఒక ఆకర్షణ ఉన్నదని నేననడం మరిచిపోయావా?"

"సరే. ఇక మిగిలినతను De Maupassant. ఇతడెలాగ ఆకర్షిస్తాడో నిన్ను?"

"అదుగో అప్పుడే నీతో ఒకవేళాకోళం వినబడుతోంది నా ఋజుత్వాన్నే నువ్వు శకించి మాట్లాడుతున్నావు. అందుకే ఇది చర్చించవంటె పైకి లాగేవు నన్ను."

"నీ పట్ల నాకు గౌరవమే లేకపోతే నీతో సమాన స్థాయిని మాట్లాడనని తెలుసుకదా నీకు, నీ ఊహాల పరిణామం జాగ్రత్తగా గమనిస్తూ నిన్నంతో మన్నిస్తున్న వాణ్ణి నేను. సమగ్రపాండిత్యం ఉంటేనే కాని నోరువిప్పకూడదని మెవరన గలరు? చిన్న బుచ్చుకోనక Maupassant గురించికూడ నువ్వెలాగ ఫీలవుతావో చెప్పు." 'I'll be very brief. ఒకటి; Maupassant ని కూడా తర్జుమాలోనే చదివాను. కాని చాలా, అనగా కొన్నినవలలు ఎక్కో కథలూ చదివాను. రెండు: అతనిది మహోన్మాదం లోని మహాకవిత్వం. గద్యం పద్యం అనే సరిహద్దులకు అతీకమైనది. పద్యాలేవీ వ్రాయకపోయినా నా కవి! వింత sensations వికి కవిత్వం చేసినవాడు. నాడుల మీదుగా విద్యుచ్ఛక్తి ప్రవహింపిస్తాడు. నేనెవరిని గురించీ superlatives లో మాట్లాడను కనుక ఇది మాత్రం చెప్పుతున్నాను; కథానకంలో అతనిది ప్రపంచరచయితలలో ప్రప్రథమశ్రేణి. short story కీ Lyric కీ భేదం లేదని నా ఉత్సాహంలో ఒక్కొక్కప్పుడనేస్తుంటానే దాని కీతని కథలే కారణం. అసలా రెండింటికీ technique లో సమీపసాజాత్యం ఉన్నదిలే, కవిత్వమనే spirit ని కుంభించుకున్న దివ్యసృష్టి అతని రచనలో కొన్నిభాగాలు, కవిత్వం అనగా ఏమిటని నేను వేసుకున్న ప్రశ్నకు జవాబుగా అతనిలోంచే చాలా సామగ్రి ఏరుకోవలసి ఉంటుంది.

# తీరని సమస్య

చెఱుకువాడ వేంకటరామయ్యగారు



“వాళ్ళది పాతపేటలో ఉంది ఇల్లు. మేము కొత్త పేటలో ఒక అద్దెయింట్లో ఉండేవాళ్లము. హైస్కూల్లో ఫోర్తుఫారము చదువుతూండేవాళ్ళము. ఎఱ్ఱగా పొడుగ్గా ఉండేవాడు. నాకూ అతనికీ చాలా స్నేహము. ఇస్కూల్లో ఉన్నప్పుడు యింటికివచ్చినప్పుడు బజారుకి వెళ్లినప్పుడూ ఎప్పుడూ కలిసే వుండేవాళ్లము. నా కత నితో స్నేహ మయ్యేటప్పటికే అతనిపెళ్లాము కాప రానికి వచ్చింది. తల్లీ తనూ పెళ్లామూ ముగ్గురూ ఉండేవా రాయింటోను. సాలుకు రెండుమూడువేల రూపాయిలు వచ్చేవి అతనికి భూములమీద. వేషము లోనూ తిండిలోనూ చాలాదర్జాగా ఉండేవాడు. మాతో తిరిగేటప్పుడూ అప్పుడూ చాలాసరదాగా ఉండేవాడు గాని యింటికి వెళ్ళేటప్పటికి మాత్రము మొఖము మటమట లాడ్చుకునేవాడు. ఏంచేతచెప్మా అనుకుంటూండేవాణ్ణి.

ఇల్లా ఉంటూండగా మేము కాపురమున్నయింట్లో యింకోవాటాలో ఉన్నవాళ్లింటికి యెవళ్లో చుట్టా లొచ్చారు. వచ్చినవాళ్లల్లో వొకావిడ ఆయింటోఉన్న ఆవిడతో యేమిటో చెబుతోంది. ఆమాటలు నా చెవిని పడ్డాయి. “వాళ్లిజానకిరాముడు పెళ్లాముమొఖము చూడనే చూడట్ట. అత్తగారికి కోడలంటే అసలే పడ దట. దాసీదాన్ని జూసినట్లు చూస్తుందట. ఆమొగుడు యింటికే రాట్ట. వస్తే పదిమంది స్నేహితులతో వచ్చి పిచ్చాపాటీ మాట్లాడుకుని చదువుకుంటే చదువుకుని వెళ్లిపోతూంటాట్ట. డబ్బుచూసి యిచ్చాడు ఆమామ గారు. ఆతల్లికొక్కతే కూతురు”

జానకిరాముడు అనేసరికి మావాడే అనుకున్నాను.

“ఊరంతా పెళ్లినాడే అనుకున్నారు వరహీనం వరహీనమని”

వీడిమొఖంమటమట నా కర్థమయింది. అర్థమయి చేసేదేమిటి. అయినా స్నేహితులమయివుండి వీ డదో పరితాపంలో ఉన్నప్పుడు కారణము తెలుసుకుని ప్రతి క్రియ యేమన్నా వుంటే చేస్తే బాగుంటుందని మాత్రము అనుకున్నాను. తరుచు వాళ్లింటికి వెళ్లేవాణ్ణి గాని వాడి పెళ్లాము ఆట్టే కనుపడేదికాదు. ఇంతకూ సావిడి దాటి లోపలికి వెళ్లేవాళ్లము గాము. ఆవిడమాత్రము మా యింటికి అప్పుడప్పుడు పేరంటానికి వచ్చినప్పుడు చూసీ చూడ్డంగా చూసీవాణ్ణి చక్కగానే ఉండేది బొద్దుగా ఎఱ్ఱగా. చదువుకుందిట కూడాను. అందచందము విష యములో వీడు అసహ్యించుకో నవసరము కనబడదు. ఇంక అత్తారు యివ్వడము పుచ్చుకోడాల్లో యేమన్నా తేడా వచ్చిందాంటే అదీ యెప్పుడూ వినలేదు. ఇంతకూ వాళ్లు చాలా బాగావున్నవాళ్లు అదీగాక వొకత్తే ఆడపిల్ల. మరేమిటిరా వీడికి సంసారసుఖం లేకపోవడానికి కారణము. ఏం తెలుస్తుంది కుర్రాళ్లము. పెద్దవాళ్లతో మాట్లాడే విషయముకాదు. నాకు యేమీ తోచీది కాదు. వాణ్ణే అడుగుదామనుకుని యే మనుకుంటాడో పాప మని ఊరుకునేవాణ్ణి

కొన్నాళ్లకి ఆవిడపుట్టింట యేదో శుభకార్యమని వాళ్లనాళ్లెవళ్లో వచ్చి ఆవిడ్ని తీసుకెళ్లారు. అవెళ్లడం వెళ్లడం యెన్నాళ్లకీ రానేలేదు. వాళ్లంతట వాళ్లు తీసుకు రాలేదు సరేగదా వీడైనా వెళ్లిగాని ఉత్తరంవ్రాసిగాని తీసుగురాలేదు.........

ఓనాడు వాళ్లమేడమీద కూర్చుని ఉండగా టపా బంట్రోతు ఒకవుత్తరము యిచ్చాడు. పై పేరు చూడ గానే ఆడవాళ్ల దస్తూరీలా తోచింది. వెంటనే,

“ఏమిరా వదెన్ని తీసుకొచ్చేవేకావు”

“......................”

“నిన్నే”

“ఇదిగో ఈజాబదే విప్పి చదువు” అన్నాను.

“నేచదివితేం నువుచదివితేం చదివి సంగతేమిటో చెప్పరాదూ”

మామూలుగా యెంతస్నేహితుడు ఉత్తరమైనా చద వడానికి యెల్లాగో ఉంటుంది. వాడు చదవమన్నాడు

అనుకుందాము అయినా వాడి భార్య వ్రాసిందికూడాను. చదవడానికి సంకోచ మేసింది. చాలాసేపు ఊరికే కూచున్నాను. వాడు యేమీ మాట్లాడలేదు. జాబు చదివేడుకాడు. కూచునికూచుని చివాలునలేచి చక్కా వచ్చాను యింటికి. ఆ వుత్తరప్రశంస మళ్లీ మేమిద్దరము యెప్పుడూ అనుకోలేదు.

ఎవళ్లు తీసుకుని వచ్చారో జ్ఞాపకము లేదు గాని ఓనాడు ఆవిడ వొచ్చేసింది.

రెండుమూడురోజు లయ్యాక మా ఆవిడ కేదో జబ్బుగా ఉందిట, ఆడాసుపత్రికి తీసుగెడదాం వస్తావా అన్నాడు. అల్లాగే అన్నాను. ముగ్గురమూ వెళ్లాము. దొరసాని చాలాసేపు పరీక్ష చేసింది. ఏదోజబ్బు అని చెప్పింది కాని (Pregnant) ప్రెగ్నెంటులా తోస్తుంది అంది. ఆ సంగతి ఆతనికీ ఆవిడకీ తెలియాలి నా కేమి తెలుస్తుంది. అతడుమాత్రము ఈమాట వినగానే కొంచెము తెల్లబోయి మళ్లీ నిల్దొక్కుకుని, "సరే మందు రేపు ప్రారంభిద్దా" మని దొరసానితో చెప్పి వెడదాము పదండి అన్నాడు. ఇంటికొచ్చేసాము.

ఆవిడ యేడనిమిది నెల్లాయె ఊరికెళ్లింది. కడుపే మిటి? ఊం! దొరసాను మాటలు నిజమా యేమిటి. కడుపులో బల్లపెరిగితే కడు పంటారు. కడుపు వస్తే బల్లంటారు. పట్నములో యిల్లాగే వోనాయకుగారి భార్యకి కడుపొస్తే దొరసానులంతా బల్ల బల్ల అన్నారు తరువాత ఆవిడ నీళ్లాడింది. కాకపోతే బల్లకోసము చేసినవైద్యాలు కట్లువల్ల పుట్టినపిల్ల చాలారోజులు సీరసంగా ఉందిగాని. ఇల్లాగే వాళ్లభిప్రాయాలు తారు మారుగ ఉంటాయి కడుపూలేదు కాలులేదు. కాప రానికొచ్చిన పదేళ్లికి అసలు కడుపేమిటి అనుకున్నాను నేను. వా డేమనుకున్నాడో నా కేమీ తెలియదు.

మా పెద్దక్కయ్యకూడా అప్పుడు కడుపుతోంది. వాళ్లింటికీ మా యింటికీ కూడా రోజూ యెవరో సూడి దలు తేవడము. చెపితే నమ్ముతారో లేదో గాని ఆ రోజుల్లో మిఠాయీ జంతికలూ రానిరోజే లేదు. లడ్డూఅంటే ఆరోజుల్లో చాలాగొప్ప. చాలాఖరీ దుండేది. మణుగు అయిదారు యింకా యేడెనిమిది రూపాయిలుకూడా ఉండేది. పంచదారదైతే చెప్పనే అక్కరలేదు. ఇప్పు డేమిటి మణుగు రెండురూపాయిలు. అయితే అప్పుడు యీవాలాజానూనెలూ అవీ లేవు. పప్పునూనెకూడా యెక్కడోగాని దొరికేది కాదు. అంతా నెయ్యి, పైగా యిన్నిదుకాణా లెక్కడ యేడికాయి. మార్కెట్టుదగ్గిర వొకటుండేవి. బజారులో మధ్య రెండో మూడో తెలగపిండి మిఠాయిదుకాణాలుండేవి. అయితే స్టేషనుదగ్గిర వొకమారువాడీ దుకాణ ముండేది. అక్కడ అన్నివస్తువులు పచ్చగా ఉండేవి పసు పేసినట్టు. ఖరీదులు మండిపోతూండేవి. ఆ దుకాణములో వస్తువులు తిం టారో అదుకుంటారో బొమ్మలబీరువాల్లో పెట్టుకుంటా రో కూడా తెలిసేదుకాదు. మనిసి మహాసుభ్రంగా ఉండే వాడు తెల్లనిచొక్కా చిన్న గుండ్రని తెల్లటోపీ. బట్ట మాత్రము అసహ్యంగా ఉండేది. అక్కడ పన్నీరులడ్డూ అని వొకటుండేది. జానికిరాముడు అత్తారు అదే కొన్నా రు, ఊళ్లో పంచిపెట్టడానికి. ఇంట్లోవాళ్ళకి జంతికలు వండించారు.

వాళ్లింటిదగ్గిరో మాయింటిదగ్గిరో రెండు పూట్లానో మేము మిఠాయి తిననిరోజులేదు. మా యింటివద్ద తిన్నప్పుడు సరదాగా కబుర్లు చెవుతూ తింటూండేవాడు. వాళ్లింటిదగ్గిర తినవలిస్తే వినుగుదలగా నాకోసముతిన్నట్టు తినేవాడు.

ఒకనాడు మధ్యాహ్నము ౧-౨గంట్లబండిమీద వొంటి గంటకి ఆవిడతమ్ముడు పురిటికి తీసుకెళ్లడానికి వచ్చాడు జానికిరాముడు తీసుకెళ్లమన్నాడు గాని అత్తగారు,

"అప్పుడే యెందుకు యేడోనెల నిన్ననేగా వచ్చింది"

"ఏడోనెల కనకనే తీసుకెడదామని వచ్చాము"

"తొమ్మిదోనెల్ని తీసుకువెళ్లొచ్చు. నేను పెద్దద న్నయినాను వొక్కత్తినీ చెయ్యాలేను పెట్టాలేనూ"

"అదేమి టమ్మా తొలిసారిపురుడు మాకు అచ్చట ముచ్చటా జరగక్కరలేదూ? తరువాత నిండుగర్భి మీద ప్రయాణముకూడా ప్రయాసా ప్రమాదముకూ డాను"

"మీ యిష్టము మీ ఖాయిష్టము నా మాట నేను చెప్పాను"

"ఏ మంటావోయ్"

"ఆవిడ అల్లా అంటూంటే నేను పంపిస్తే యేం బాగుంటుంది. తొమ్మిదో నెల రాగానే తీసుకువెడ్దుగాని లే" అన్నాడు. మే మిద్దరమూ కాలేజీకి వెళ్లిపోయాము.

మధ్యాహ్నము వాడూ నేనూ మా యింటిదగ్గిరే భోంచేశాము. సాయంకాలము కాలేజీ విదిలిపెట్టగానే పుస్తకాలు యింటిదగ్గిర పారేసి వాళ్లింటి కెళ్ళాము. మూడుగంటల బండికి తమ్ముడూ ఆవిడా వెళ్లిపోయారని వాళ్ళమ్మ చెప్పింది. మొగుడికీ అత్తగారికీ కూడా యిష్టము లేనప్పుడు యెల్లా వెళ్లిందో అనుకున్నాను. గొప్పవాళ్ళాడబడుచు లయితే యిల్లాగే కామాన్ను అనుకుని ఊరుకున్నానుగాని మొదట, చివరకి ఉండబట్టలేక.

"ఏమిరా యిల్లా జరిగింది అల్లా వెళ్లిపోవడమే"

"......................."

"నీ విదోజవాబు చెబితేగాని ఊరుకోను. మునుపూ యిల్లాగే ఊరుకున్నావు. స్నేహమంటే షికార్లుతిరగడమూ పకోడీలు తినడముతోనేరా! కష్టసుఖాల్లో వొకరికొకరు సాయపడవద్దా? ఆప్తులతో చెప్పుకుంటే సంతోషము ద్విగుణ మవుతుందని విచారము సగ మవుతుందని అంటారు. మాతో ఎంతో కులాసాగా తిరుగుతావు చేస్తావు. ఇల్లంటే హెల్లా (Hell) చూస్తావు. వదినెకి నీమీద యిష్టము లేదా? నీకు వదినెమీద యిష్టము లేదా? రెండూ కాదా? నాకేమీ తెలియడము లేదు. ధోరణి, నీడబ్బుకోసమూ నీతిండికోసమూ యెదో ఆత్మలాభము చూసుకుని చేరేవాళ్లేగాని యీ స్నేహితులంతా అవసరానికి అక్కరకొస్తారా? భార్య అంటే యేమిటో యెరగవా అర్ధాంగి: హారీ అన్నదాకా అన్యోన్యము ఎంత ఎల్లా ఉండాలి? నీ వావిషయమేమీ ఆలోచిస్తున్నట్టే లేదు. చూస్తూ ఊరుకోడము నాకూ బాగాలేదు" అన్నాను.

వినివిని నాలెక్చరు, కూర్చున్నవాడు కూర్చున్నట్టే కళ్లంట నీళ్లెట్టుకున్నాడు. ఇదేమిట్రా నిక్షేపములా సవ్యతోఉన్నవాణ్ణి యేడిపించాను అనుకుని కాస్సేపు కూచుని తిన్నగా యింటికి చక్కావచ్చాను. వాడితో చెప్పకుండా కూడాను.

కొద్దిరోజులకే వుత్తరము వచ్చింది పిల్లాడు పుట్టాడని. నక్షత్రము వగయిరా వాళ్లేమి అందులో వ్రాయలేదు. వారమూ సైమూ మాత్రము రాశారు. వీడు కూడా నక్షత్ర మేమిటో చూద్దా మని ప్రయత్నము చెయ్యలేదు. నేనుమాత్రము చూపి శాంతినక్షత్రమే అనుకున్నాను. స్నేహితులతోటీ వాళ్లతోటీ యీ సంగతేమీ అంత చెప్పలేదు వీడు. అత్తవారికి జవాబూ రాయలేదు.

రోజులు గడిచాయి వారాలు గడిచాయి పక్షాలూ నెల్లూ అయిపోతున్నాయి. బారసాల చేసుకోమని అన్నప్రాశనని యేమిటేమిటో చేసుకోవలసినదనీ రమ్మనీ ఉత్తరాలూ కబుర్లూ వస్తూండేవి. ఉత్తరాలు చింపి పారేస్తుండేవాడు. ఆయేడు పరీక్ష ఫేలయాడు. నిత్యమూ యేదో మనో వ్యాధిచేత బాధ పడుతున్నట్టుండేవాడు. చిక్కిపోతున్నట్టుకూడా ఉండేవాడు, స్నేహితుల మెంత హెచ్చరిక చేసినా ఆకాస్సేపూ యెకోహాలుసాగా కనబడేవాడు గాని మొత్తముమీద దిగాలుపడి ఉండేవాడు. పోయినపరీక్ష పోనేపోయింది మళ్లీ చదివినక్లాసే కదా చదివేది తీరుబాటు యెక్కువ ఉంటుంది. యేదైనా జెనరల్ స్టడీ చెయ్యవచ్చు నని భగవద్గీతొకటి కొన్నాడు. అంటే ఆనిబిసెంటమ్మగారి ఇంగ్లీషుట్రాన్స్లేషను మూలము నాగరిలిపి. నాగరిలిపి రాకపోయినా యింగ్లీషుతర్జుమా చదువుకోవచ్చుగా? సంస్కృతము అసలురాదు. తెలుగు బాగారాదు మనవాళ్లకి దాంతోపాటు స్వామివివేకానందుని వాఖ్యానములు రెండు కొన్నాడు. తోచనప్పుడు అవి చూస్తూండేవాడు.

పదినెల్లు గడిచాయి.

ఒకనాడు హఠాత్తుగా, పెత్తల్లినీ వో చాకల్దాణ్ణి సాయము తీసుకుని పిల్లాణ్ణితీసుకుని ఆవిడ సాయంకాలపు బండిమీద దిగింది. పెత్తల్లి పుణ్యస్త్రీ చాలా పెద్దది అయిదారురోజు లుండి వెళ్లిపోయింది. ఆ అయిదారు

రోజుల్లోనూ మూడో నెల్ని చేసే ముద్దగుడుములూ గడప దాటేటప్పుడు వండేగార్లూ అడుగువేశేటప్పుడు వండే అరిసెలూ అత్తవారింటికి పంపేటప్పుడు చేసే చొంగ చక్కిలాలూ (అప్పటికప్పుడే బాగా అన్నమే తింటున్నాడుపిల్లాడు) ఏమిటేమిటో చేసింది ఆవిడ. పంచిపెట్టారు. వీడు ఆపిల్లాణ్ణి యెత్తుకోలేదు. ముద్దెట్టుకోలేదు. చూశాడో లేదో కూడాను: మేమంతా పిల్లాణ్ణి చూపించరా అంటే, కొత్త నాదగ్గర, యింకా అలవాటు కాలే దనేవాడు ఆఖరికి వోమాటుగామాన్ను తీసుకువచ్చి చూపించాడు. పిల్లాడికేం నిక్షేపములా గున్నాడు. దబ్బపండులాగ వంటినిండా వంటెడునగలు తుమ్మెదరెక్కల్లాగ మొఖం మీదికిపడుతూ పుట్టెంటికలు. సీతాకాలమో యేమిటో ఎఱ్ఱది చారలఫ్లానలుజుబ్బా తొడిగారు, బాగున్నా డంటే బాగున్నా డనుకున్నాము—మాలోవొకడు

"పేరేమిట్రా"

"............" మరియొకడు

"ఆఁ, పేరేమిటి వాళ్లనాన్నగారిపేరే"

మరియొకడు

"మామగారిపేరేమోని"

నేను

"దేముడుపేరు పెడతాము ఏదన్నా తండ్రీలేదు తాతలేదు. కొత్తగా ఉండేది చిన్నదిగా ఉండేదీని"

అన్నాను పిల్లాడు కార్ మని యేడిచాడు యింట్లోకి తీసికెళ్లాడు. బారసాల చెయ్యలేదు పేరుపెట్టలేదు. ఏమీ లేదూ.

రెండుమూడు నెల్లకి......కాకినాడలో యెదోపని ఉందనీ జానికిరాముడు రెండురోజుల్లో వస్తాననీ సాయంకాలము స్టీమలుకి వెళ్లాడు రెండురోజు లయింది. మూడు అయింది. నాలు గైంది. నేను యెప్పుడూ వాణ్ణి విడిచిపెట్టి ఉండలేదు, నాకు పిచ్చెత్తినట్టుంది ఉత్తరమేనా రాశాడు కాడు. చూసిచూసి నేనే కాకినాడ వెళ్లాను. వా డావూరే రాలేదన్నారు వాళ్లవాళ్లు. ఏమయినాడు? నాకు కంగా రెత్తింది. నిలువునా నీరైపోయినాను. తల తిరిగి నట్లయింది. సరే; కొంతసేపటికి తట్టుకుని వాళ్లింట్లో ఆపూట భోంచేసి యింటికివచ్చేశాను. వచ్చానంటే సరా వాళ్లింటికి వెళ్లి చెప్పాలి? ఎల్లా వెళ్లను. యేమని చెప్పను? నాకేమీతోచలేదు. చివరికి వెళ్లాను. వెళ్లి యేంచెప్పానో తెలియదు. వాళ్లమ్మ పెద్దపెట్టున యేడువసాగింది. ఆయేడుపు విని కోడలు పిల్లాణ్ణెత్తుకుని వాకిట్లోకి వచ్చింది. "మీనాన్న దేశాంతరం పాలైపోయాడు బాబూ! మీ అమ్మ..." అంటూ పిల్లాణ్ణి లాక్కుంది. నే నున్నానని కాబోలు ఆమాట పూర్తిగా అందికాదు ఏమన్నో? కోడలిమొగం మీద యేలక్షణమూ నాకు కనుపించలేదు. అత్తగార్ని ఊరడించాలేదు. ఇంట్లోకి వెళ్లిపోయింది.

ఆనాడు కొన్నిచోట్లకి టెలిగ్రాములూ కొన్నిచోట్లకిజాబులూ కొన్నిచోట్లకి మనుష్యుల్నీ పంపి జవాబుల కోసము కాచు కూర్చున్నాము. జాడాజవాబూ యెక్కడా పికర్ లేదు. నాకు మతిపోయింది. వాళ్లమ్మ సంగతి చెప్పనే అక్కరలేదు. నా కప్పటికే కవిత్వము వచ్చు, భర్తృహరి—

పెక్కుదివియలున్న జక్కవచెలియున్న
రిక్కరాయ డున్న జుక్క లున్న
చిన్నిలేడిచూపు చేలియ నెడబాయు
నప్పు డంధకార మయ్యె జగము."

అని తనభార్యా వియోగమునుగూర్చి వ్రాసుకున్నాడు. స్నేహముయొక్కమజా వాడికేం తెలుసు మహారాజుకి అని అనుకుని 3, ౪ పాదాలు "నిష్కళంక హృదయు నెచ్చెలి నెడబాయ నప్పు డంధకార మగును జగము"

అని మార్చుకున్నాను. అప్పుడు యింకా స్నేహము మీద చాలాపద్యాలు వ్రాశాను కాని యీపత్రికలో వెయ్యరేమో తీరా యీకథ అని యిక్కడ యెక్కించలేదు.

డబ్బుకి వాళ్లకు లోపములేదు. ఆలోచనకు నాకు లోపములేదు. డబ్బు విరచిమ్మి కాశీ రామేశ్వరాలు వెతికించాము. యేమీ ఆచోకీ తెలియలేదు. మా

కాయకష్టులా తంటాలు పడ్డాము. లాభము లేక పోయింది.

* * * * *

నేను మధ్యాహ్నము కాలేజీనుంచి వచ్చేటప్పటికి వ్రాతబల్లమీద కవరుత్తర మొకటున్నది. కవరు కొత్తమోస్తరుగా ఉంది టపాముద్ర చూస్తే బాగా కనపడడము లేదు, ఎప్పుడూ టపాముద్రలు అల్లాగే ఉంటాయి. అవసరములేక చూడముగాని చూస్తే యెప్పుడూ యింతే. భూతద్దము పెట్టి చూడండి యేమి చెయ్యండి చస్తే తెలియదు. చింపి జాబు చదివాను. ఇంగ్లీషున వ్రాయబడినది. భాష జానకిరాముడిదే వ్రాత మరొకడిదిలాఉంది బాగా పరకాయిస్తే అక్కడక్కడ అక్షరాల్లోకూడా వాడిఅక్షరాలపోల్కి ఉన్నట్టుంది. విషయ మేమి టంటే ?

ఈజాబు నా పరిచయిస్తుడొకడు వ్రాయమంటే వ్రాస్తున్నాను. అతడు మీకు చాలాస్నేహితు డట. తాను కొన్ని కారణములచేత సన్యసించినానని తనవారి కెవరికీ తనవిషయమైనయాశ యింక యీ ప్రపంచములో ఉండవక్కరలేదనీ దీనికంతకు కారణము నూతనశిశు వనీ, యీ సంగతులు నాకు కూడా కొంత తెలుసుననీ యింతే. క్రింద సిరీషకుమార్ అని సంతక మేదో ఉంది. స్టేషను తారీఖు వగయిరా యేమీలేవు.

బ్రతికున్నాడుగదా పోనీ అనుకున్నాను. కాని నాడు కాకినాడలో తిరిగినకన్నా యెక్కువగా నాతల తిరిగి పోయింది.

"సరే బాగానే ఉంది సన్యసించాడు ఈపుట్టినపిల్లాడి సంగతి నాకేమి తెలుసు. తెలిస్తే తనకు తెలుసును కాబోసు. నాతో చెప్పాడా యేడిశాడా. వీడు తనసంతతి కాదన్నమాట. ఈలేచిపోవడమూ యీసన్యాసమూ వీడిమొఖం చూడలేకే వీడిదిగులుకి యేదో గృహకల్లోలమనీ భార్యసంబంధమనీ అనుకుంటూవచ్చి వాణ్ణిగాని యిందాకా ఆలోచించలేకపోయినాను. ఎంతటి వాళ్లయినా ఉంటారు. "స్త్రీణా మశిక్షితపటుత్వ మమామషీష సంద్దృశ్యతే కిముతయా ప్రతిబోధవత్" అన్న కాళిదాసు వెఱ్ఱివాడా ! అనువత్రిలో దొరసాని గర్భిణీ అనుకుంటా నన్నప్పుడు వీడు నిర్ఘాంతపోయాడుమొదట మొఖముమీద కత్తివాటేసినా నెత్తురుచుక్క లేనట్లయింది. కాని వెంటనే నిర్దొక్కుకున్నాడు. ఏమిటి చెప్మా అనుకున్నాను. ఏం తెలుస్తుంది మనుష్యుడు సర్వజ్ఞుడా యేమిటి. ఏమయితే యివ్వు డేమి చేస్తాము" అనుకుని గొంతుక ఆర్చుకుపోతే కొంచెము మంచినీళ్లు తాగి ఉత్తరము జేబులో పెట్టుకుని వాళ్లింటికి వెళ్లాను. గుమ్మాని కెదురుగుండా తల్లి మడిగట్టుకుని వత్తి విడదీస్తోంది. కొంచెము దూరంగా ఉత్తరముఖముగా చిత్రాసనముమీద పురాణంచెప్పేబ్రాహ్మడు కూచుని వ్యాసపీఠముమీది పుస్తకంలోనుంచి యేవోశ్లోకాలు చదివి అర్థము చెబుతున్నాడు. ఆశ్లోకాలర్థమో మరేమన్నానో. వినేది యీావిడ వొకత్తే గాని ఆయన గట్టిగా చెబుతున్నాడు. వళ్లంతా చెమట బట్టిన ట్లయింది కనరతు చేస్తున్నట్టు విరిగి ముక్క లవుతున్నాడు. వొకరికి చెబితేం ఊరందరికీ చెబితేం ఆయన కది అలవాటు. కుమారుడు లేచిపోయినప్పటినుంచీ తల్లికి యేమీతోచక కాలక్షేపముకోసము నెలకి పదిరూపాయి లేర్పాటు చేసుకుని యీబ్రాహ్మడిచేత పురాణంవింటోంది.

నన్ను చూడగానే ఆయన ఛప్పున పురాణము ఆపుచేసి దయచెయ్యండి పంతులుగారూ అని అక్కడున్న భద్రాచలము తుంగచాప కొంచెము తనదగ్గరగా లాగాడు. చిత్తము అని నేను కూచుని కానియ్యండి అన్నాను. కానియ్యడానికి ఆయన యెక్కడ ఆపాడో ఆయనకి తెలిస్తెగా ! నేనైనా చెప్పాలి సోదకైనా వెళ్లాలి. దగ్గరనున్న పొడుంకాయ తీసి చిటికెడు పొడుము పీల్చి చెయ్యి గోడకురాసి ఉద్ధరిణెడు నీళ్లు వేళ్లమీద పోసుకుని కొల్లాయితో తుడుచుకుని పత్రాలు తిరగేస్తున్నాడు.

"ఏమిటి విశేషాలు బాబూ పిల్లలుక్షేమమా" అంది ఆవిడ.

విశేషా లేమున్నాయి ! ఆదివారము సెలవుగదా మళ్లీఆదివారముదాకా తీరుబడే ఉండదు. చూసిపోదా

మని వచ్చాను. అని శాస్త్రపు పురాణం కిసీ యింటి కొచ్చాశాను.

ఏమీ తోచిందికాదు రాత్రి భోంచేసి మళ్లీ వెళ్లాను. ఆవిడ ఫలహారము చేస్తోంది. కోడలుతమ్ముడు యిక్కడే ఉండి చదుకుంటున్నాడు. ఈజా బతనిచేతి కిచ్చి "చదివి మీ అత్తకి అక్కయ్యకి అర్థము చెప్పు. నేను పొద్దున్నే వస్తాను" అని జాబిచ్చి చక్కా వచ్చాను. నాకు తెల్ల వార్లూ నిద్దర పట్టనే లేదు.

ఉదయాన్నె లేచి వాళ్లింటికి వెళ్లాను. తల్లికి ఫెళ్లు మంటూ జ్వరము. తెల్లవార్లూ పేలాపకెట ముందు పూజారి గారయ్యకి కబురంపి చెయ్యి చూపించి మందు తెప్పించి వేయించి శాస్త్రపు మంచందగ్గర కూర్చు న్నాను గాని నాతో మాట్లాడడానికి వీల్లేనంత తాపంగా ఉంది ఆవిడకి. రెండుపూట్లా వెళ్లి చూచీ వాణ్ణి. గుణము కనుపించడము లేదు. వైద్యుణ్ణి మారుద్దా మంటే, ఆగారయ్యమాత్రలే గాని ఆవిడ మింగదు. జ్వరము అంతకంతకు యెక్కువైంది. సంధిం చింది. చివరకి ౧౨ రోజనో ౧౩ రోజునో జ్ఞాపకంలేదు హఠాత్తుగా తెలివి వచ్చినట్టు లేచికూర్చుని "అడుగో నానాయన ఇల్లారమ్మంటే రానంటున్నాడు: నేనే వాడి దగ్గరకు వెడతాను. బాబూ! సుబ్బారావు! ఇల్లు జాగ్రత్త. నేను వాడిదగ్గరకే వెడతా" అంటూ వెనక్కి వాలి ప్రాణములు విడిచింది. జ్ఞాతులూ చుట్టాలూ చాలా మందున్నారు ఉత్తరక్రియలు యెల్లాగో జరిగాయి. అగు తాయా యేమిటి!

ఆజాబుకి జవాబు రాద్దామంటే విలాసము తెలి యదు. ఆవైపులకు వెడదామంటే ధనమూ కావాలి, తీరుబడీ కావాలి. ఇంతకీ నాకోసముగాని తల్లి యెల్లాగా చచ్చింది. ఏమీ చెయ్యలేక ఊరుకున్నాను. ఆపై సంవ త్సరమే గామాన్ను నేను మాస్వగ్రామము వెళ్లిపోయి నాను.

పదిపదహారేళ్లయింది. అవూ రాట్టే వెళ్లనూ లేదు నా శాకుట్టాడు ఎక్కడా కనుపించనూ లేదు. కనపడ్డా డేమో ఆనవాలు పట్టడానికి వాణ్ణి యెరిగుంటేగా!

ఏడాది యేడ్చు(ర్)మప్పుడు యెప్పుడో వొకటి రెండుసార్లు చూశాను. ఏదో అక్షరాభ్యాసమనో ఒడుగనీ పెళ్లనీ యేవో శుభలేఖలు మాత్రము వస్తూండేవి. కానైతే నేనప్పుడూ వెళ్లలేదు. వెళ్లడానికి యెల్లాగో ఉండేది. ఇంతకూ స్నేహమనేది ఆవ్యక్తితోనే ఉంటుందిగాని చుట్టరికములాగా ఆవంశమంతటితోనూ ఉంటుందా. వొకప్పుడు కొంచెము ఆమనిషినుండి వానిఅన్నదమ్ముల దాకానూ పెద్దవాళ్లుగాఉంటే వంశాన్నముదాకాను పాకచ్చు గాని ఈకుఱ్ఱాడి జన్మమీదే అనుమాన మాయెను.

ఏదోకోర్టుపనిమీద ఆవూరు వెళ్లాను. మాచుట్టా లింట్లో బస. ఆరాత్రి యేదో టాకసినిమాఅంటే వెళ్లాను. తెనుగు కాదు. నేను వెళ్లేప్పటికే ఆట ప్రారంభ మయింది. ఆచీకట్లోనే యేదో కుర్చీమీద కూర్చు న్నాను. పార్టు అయిపోగానే గప్పున లైటు వెలిగింది. అంతట్లోనే, నాపక్కనుకూర్చున్నవాడు యథాలావంగా కనపడ్డాడు. లైటారిపోయింది. ఈమనిషిని యెక్కడో చూచినట్లుంది యెక్కడ చూశాను చెప్మా నరే మళ్లీ లైటువేస్తారుగదా చూద్దా మనుకున్నాను. లైటు మళ్లీ వెలిగింది బాగా చూసినముఖంలా వుంది. ఆట చూడ డం మరచేపోయాను. హఠాత్తుగా మాజానికిరాముడు జ్ఞాపకం వచ్చాడు. లావూ పొడుగూ ఆవన్నిముక్కు అంతా అచ్చంగా జానికిరాముడే. వాడే వచ్చుం టాడా అనుకున్నాను. వస్తే రావచ్చు గాని అంతయవ్వ నములో యెల్లా వుంటాడు ఉంటే వుండొచ్చు కొన్నాళ్లు సన్యాసిగా ఉన్నాడు గనుక దేహాన్ని యవ్వనములో ఉంచుకో గలిగాడేమో అనుకుంటూ ఏదో ఆలోచిస్తు న్నాను. ఆట అయిపోయింది లైట్లన్నీ వెలిగాయి ఆమనిషి వెనకాలే వీధిలోకి వచ్చాను కొంచెము ముందుకి వెళ్లి.

"ఏమండీ మీదేవూరు"

"మా దీవూరే"

"మీపేరు"

"జానికిరామారావు"

"మీయింటిపేరు"

"కరావారు"

"మీరు నన్నెరుగుదురా"

"ఎఱగ నండి"

"నాపేరు సుబ్బరాజు అంటారు లెండి. ఎక్కడైనా చూసినట్లుగాని పేరువిన్నట్టుగాని ఉందా"

"అన్నట్టు చూడలేదుగాని మావాళ్లు మీ పేరు తరుచు చెప్పగుంటూంటే విన్నాను.

"మీ వాళ్లంటే?

"మా బాబయ్యా మా అమ్మ వాళ్లూను. మీకూ మాతండ్రిగారికీ చాలాస్నేహమట. నేను మిమ్మల్ని చూడడము తటస్థించలేదు."

అప్పటి కప్పుడే హైరోడ్డుమీదికి వచ్చాము.

"మీ రాయింట్లోనే వున్నారుగాదూ"

"ఆ బాగుచేయించి అంతా మార్పుచేశాము లెండి"

"మీ అమ్మగారు బాగున్నరా?"

"ఆమె నిరుడీరోజుల్లోనే చనిపోయిందండి."

"అయ్యో పాపము"

"మీరు తప్పకుండా రేపు మాయింటికి దయచెయ్యాలి బన యొక్కడ చేశారు తప్పకుండా రావాలి సుమండీ. కాఫీ కక్కడికే రావాలి"

"ఆకాఫీలు గీఫీలు మాకు అలవాటు అవలేదు నాయనా. ఇప్పుడు పెద్దలేదు చిన్నలేదు మంచిలేదు చెడ్డలేదు అగ్రజాతిలేదు అంత్యజాతిలేదు అందరికీ వొకటే కాఫీ. మా పురోహితుడూ తాగుతాడు మా పాలు పితికే గొల్లాడు తాగుతాడు. ఇంతకూ కాలమహిమ"

"చిత్తము పోనివ్వండి, తాగితే తాగొచ్చు మానితే మానొచ్చు మీరుమాత్రము రేపక్కడికి దయచెయ్యాలి మా నాన్నగారిని నే నెఱుగనే ఎరుగను మిమ్మల్ని చూస్తే ఆయన్ని చూసిన ట్లుంది. బన యెక్కడో చెప్పారుకారు. కనిపెట్టికుని వుంటాను. సెలవు"

"నేను వస్తానుగాదూ. నీ కెందు కాశ్రమ"

ఇద్దరము చెరియొకదార్ని ఎవరింటికి వాళ్ళము వెళ్లిపోయాము నా కారాత్రి నిద్రే పట్టలేదు "ఏమిటీ చిత్రము మొదట జానికిరాముడే అనుకున్నాను. తీరా అడిగితే పేరుకూడా అదే. పేరు పెట్టకమునుపే తండ్రి లేచిపోవడముచేత ఆపేరు పెట్టారు గామాన్ను. వీణ్ణి చూస్తే వాణ్ణి చూడక్కరలేదు. అచ్చంగా వాడిఫొటో మేము పొరపాటేపడ్డాము పాపము. నేను పొరపడవచ్చునుగాని జానికిరాముకు యెందుకు పొరపడాలి ఆవిడ చరిత్ర పాపము నిర్దోషమే. స్త్రీజాతి ఎంతచులకన అయిపోయింది. ఇన్నాళ్లు పడినఅభిప్రాయము మార్చుకో వలసి వచ్చిందే. వా డేమైనాడో అతీ గతీ లేదు. ఇంతకూ యిన్నాళ్ళనుంచీ అయిష్టంగా చూచినచోటికి వెళ్లడమా వెళ్లకపోవడమా. వెడితే తప్పేమిటి యెన్ని చోట్లకి వెళ్లడములేదు." అని అనుకుంటూ ఓకునుకు తీసాను. తెల్లారింది. కాల్యకృత్యాలు తీర్చుకుని వాళ్లింటికి వెళ్ళాను. నాలుగ్గంట్లదాకా అక్కడే మంచీచెడ్డా మాట్లాడుకున్నాము. తండ్రి ఫొటోగ్రాపు ఎన్లార్జి చేయించి వాకట్లో యెదురుగుండా పెట్టాడు. అంతా బాగానే ఉంది. వాడికో కొడుకు. వాడిచేతిలో ఓరూపాయిపెట్టి ఎప్పుడైనా వస్తే కనుపడుతూంటాన్లే అని బసలోకివచ్చి ఆమర్నాడు మా వూరొచ్చాశాను. అప్పుడప్పుడు ఆ వూరు వెళ్లినప్పుడు కలుసుకుంటూనే వుండేవాళ్ళము తరువాత, కాని అప్పటికీ యిప్పటికీ నా కీసమస్య విడనే లేదు.

సుబ్బరాజు"

---

# కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు

గన్నవరపు సుబ్బరామయ్యగారు
భారతి సంపాదకులు

---

పదునయిదు పదునారేండ్లకు మునుపు కావలయు నొక నాడు సూర్యరాయాంధ్ర నిఘంటు నిర్మాణ కార్య నిర్వాహక సంఘ సమావేశము జరుగుచుండినది. ఆ సమావేశమున నపరిచితుడు, తేజస్వి యగు నొకవ్యక్తి కానవచ్చెను. ఆవ్యక్తి శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారని యచట నెవ్వరో యనుకొనుచుండిరి. అది తొలిచూపు. ఆయనరూపముననను, వేషముననను సామాన్యముగ తెలుగువారి 'కింటను బంటను' అంటని విలక్షణములు కొన్ని కానవచ్చినవి. అంతకు మున్నాయనను గూర్చిన వినుకలియయినను లేదు. ఆనాటి యాదారపు తొలిచూపున నాయనరూపము హృదయ ఫలకమున నచ్చొత్తినట్లు హత్తుకొనిపోయినది.

౧౯౧౧-వ సంవత్సరమున నాయనతో నల్పమాత్రమగు పరిచయము కలిగినది. క్రమముగ నది యనుబంధ మయినది; తరువాత ౧౯౧౮-వ సంవత్సరము నారంభమున జీవితమహాభాగ్యముగ తదీయానుజీవిత్వముగ పరిణమించినది. నాటనుండియు పంతులుగారికి నిత్యసన్నిహితుడ నయితిని. మదికెక్కిన మానిసినయి యాయుత్తమ పురుషుని మన్ననకు పాత్రుడనయితిని.

అఖండమగు నైశ్వర్యము—నిరాడంబరమగు వేషము, అపరిమితమగు దాతృత్వము— సహజవినయ సమంచితమగు స్వభావము; స్వార్థవిస్తారకమగు వ్యవసాయము, పరార్థ సంపాదనాసక్తమగు జీవనము నాంధ్రులలో నొక నాగేశ్వరరావుగారియందే సమవృత్తి నొప్పినవి. ఉత్సాహము, ధైర్యము, సాహసము, కార్యదీక్ష మొదలగు మేలిగుణముల కాయన మనికిపట్టు.

ఆగుణశీల సంపన్నుని 'పుట్టుపూర్వోత్తరముల' దడవుట యిట ననావశ్యకము. అది యపరిచితమును. ఆయనది కారణజన్మము; ఆయన యాంధ్ర దేశ జనని యమృత ప్రసవము.

తొలిచూపున దోచిన రూపమున పంతులుగారియందమరిన సుగుణములన్నియు ప్రతిబింబించుచుండినవి. నాడు నాటి కవి యింకను అభివృద్ధి నొందుచున్నవి. పదునొకండేండ్ల యనుభవమున బాగుగ పరికించి చెప్పిన మాట యిది.

వ్యాపార రంగముననుండి వెలువడుచుండిన నమృతాంజనము పేరు గానాటికే జాతీయ రాజకీయరంగముల కెగ బ్రాకియుండెను; సాంఘిక సారస్వత రంగములయందును ప్రసరించియుండెను. నేడది యాంధ్ర దేశము నలుమొగముల నన్నిరంగములయందును వింతవెలుగుల వెదచల్లుచున్నది. ఆ వెలుగుల వెల్లువ ఆంధ్ర దేశము నలమిన అంధకారమును మాయించుచున్నది. ఆవెలుగున నాంధ్రులు తమ్మును, తామున్న ప్రపంచమును చూచుకొనగలుగుచున్నారు; తమలోపములు చక్కదిద్దుకొనగలుగుచున్నారు. ఇతరజాతులలో దేశములలో పలుకుబడిని, గౌరవమును సంపాదించుకొనుచున్నారు. ఆ యుదారచరితుని, కాంధ్రు లాత్మకుటుంబమువారు. వారి సర్వతోముఖాభ్యుదయ మాయన జీవితమునకు పరమార్థము. దానిని సాధించు నుపాయముల నాయన యెల్లప్పుడు నారయుచుండును; మదికినచ్చినవానినెల్ల చేపట్టును; చేపట్టిన వానిని ఫలోన్ముఖముల నొనరించును.

ఫలప్రాప్తిదనుక ప్రారంభపరాఙ్ముఖుడు కాని కార్యశూరు డాయన. వ్యయ ప్రయాసముల పరిగణింపని గట్టిగుండె ఆయనది. తానుసాధించిన కార్య మొక్కటియంగు ళమేని యాంధ్రులను ముందునకు దేగలుగునేని ఆయన పరమానందభరితు డగును. ఆయనచేయి కలియని ప్రజాహిత కార్యము లాంధ్ర దేశమున మృగ్యములు. దీని కసంఖ్యములగు నిదర్శనములు కలవు. అవి యాబాలగోపాల మాంధ్రలోకము నెరుక కందినవి.

ఇపుడు పంతులుగారికి ప్రాయము మరలినది. అరువన్నరపది నందుకొన్నది. ముదిమి పయికొనినది. ఒత్తు తరిగిన నెరవెండ్రుకల నమరిన ముందల, లోతువారిన రేకల నుదురు, చిట్లిన బొమముడి, కడలుప్రాలిన కనుబొమలు, నడలి తరుబుదేలిన దౌడలు, ఆయన వయః

పరిణతిని ప్రకటించుచుండును. ఉబికి మొనగుండ్రనయిన నిడుముక్కున దగిలిన సులోచనములను దూసికొనివచ్చు వాడిచూపులు, ప్రశాంతరమణీయమగు ముఖము నాయనజ్ఞానవార్థక్యమును చాటుచుండును. కాని ఆయన భావములు, చేష్టితములు నిత్యయౌవనమునకు నిలయములు. అవి నవ్యమార్గముల వెంటనడచునవి.

ఆయనధరించునవి తెలిఖద్దరుపుట్టములు. తలను పెట్టునది కుల్లాయి, పలుచని రొమ్ముల తొడలుదిగజార తొడుగునది యంగరేకు, పయి నలవోకగ వలెవాటు వయిచునది యుత్తరీయము, అడుగులపయి జీరాడగట్టునది దోవతి. ముంగొంగు కుచ్చెళ్లను చేతబట్టి నిటారున వడిమీర నడచు నాయనయాకృతి రమణీయదర్శనము. అందుత్సాహ ముట్టిపడుచుండును.

నిరంతరకర్మాచరణవ్యగ్ర మాయనయుత్సాహము. అది మనశ్శరీరములపయి నధికారము చలాయించును.

అది ఇసుగును దరిజేరనీయదు; విశ్రాంతిని కోరదు; సౌఖ్యము నాశింపదు.

ఆయనహృదయము స్నిగ్ధము. అందు ద్వేషమునకు చోటులేదు. అది స్వాతంత్ర్యప్రియము. కాని మొహమాటమి కప్పుడప్పుడు తలయొగ్గుచుండును. అది యరయమి కాదు; పరోపకారజీవనుల కది తొలగద్రోసికొనరానిది.

ఆయనచిత్తవృత్తులు ప్రసన్నములు. అవి యింతల నంతల పొంగునవికావు. వెలుపలియొత్తిడిచేత నొక్కచో నవి పొంగబారినను, లోని ఆర్ద్రిత వెంటనే వానిని క్రుంగదీయును.

కార్యమునకుగాని మాటల నాయన సహింపడు; బూటకపుమాటల మన్నింపడు; స్తుతికి చలించినను నిందకు చలింపడు.

దరిద్రులు శ్రీమంతులు, అజ్ఞులు ప్రాజ్ఞులు, కొంచెపువారు గొప్పవారు, పరులు ఆత్మీయులు, ననుభేదమును అవశ్యకమయినను ఆయన పాటింపడు. ఆయన కందరు నొక్కతోయమువారే. ఆయన సకలజనసులభుడు; అన్నిజాతులవారిని, అన్నిమతములవారిని ఒకేతీరున నాదరించును.

ఆయన అడిగిన లేదనడు; అడుగక యీయడు. అడిగిన నిచ్చుట ఆయననియమము. ఆయన యీవికి పాత్రాపాత్రవిచారము పనికిరాదు; ఈ కారణమున తరచు దురాశాపీడితులగు నర్థులనంతృప్తులగుటయు, ఆయన తన్నిందకు పాత్రమ్మగుటయు కలదు.

ఆయన అధికారమును సహింపడు. దాని దౌర్బల్యమాయనకు చక్కగా తెలియును. తప్పుచేసిన తాబేదారులనయిన దండింపనొల్ల డాయన. ఎన్నడయిన, మాటలతో మందలించుట కలదు. ఆమాటలయినను కొననాలుకవి; తాత్కాలికములు. అవి హృదయమునుండి వెలువడునవి కావు; చిరముండునవి కావు. ఇది యుత్తమపురుషలక్షణము.

ఆయన సంస్కారులలో సంస్కారి; సనాతనులలో సనాతనుడు. ఉభయపక్షములవారును స్వార్థసంపాదనమున కాయనయండజేరుదురు.

ప్రభుత్వాశ్రయ మాయనకు సరిపడదు. కావున ప్రభుత్వముతో సంబంధ మాయన యేనాడును కలిగించుకొనలేదు.

ఆయనకు పేరుగన్న దేశనాయకులలో పెద్దపేరు వచ్చినది.

ఆయన యుత్తమగుణములు, సకలసంపదలు ప్రజాహృదయమును విలిచికొనినవి. ఆయనకీర్తి దేశమున నిండుకొన్నది.

ఆయన నేడొక్కటే యెత్తున, అఖిలభారతశాసనసభలో సభ్యుడయినాడు. కారణము ప్రజాసేవాభిలాష కాని ప్రభుత్వాశ్రయవాంఛ కాదు. ఆదేశము కాంగ్రెసుది; విజయము ఆయనది.

పంతులుగారినిబోలిన సంపన్నులు పలువు రాంధ్రదేశమున నుందురు. కాని గుణవంతులు మాత్రము కానరారు. నేడేకాదు. వెనుకకూడ నెన్నడు నుండినట్లు తెలియరాదు. ముందుమాట నందేహింపవలసినదే.

ఆయన ఆంధ్రజాతి కలంకారము. ఆయన పవిత్రచరిత్రము బంగరునీట లిఖింపదగినది.

# వ్యాఖ్యానములు

**ఆరో సంపుటం**

ఈ సంచికతో ప్రబుద్ధాంధ్రకు ఆరో సంపుటం ప్రారంభ మయింది. ఇందులో చిత్రపటాలు ప్రారంభించాను. ఒకటి రెండు నెలలలో వాటిని బాగా హెచ్చిస్తాను. కొన్ని కారణాలవల్ల పత్రిక పరిమాణం పెంచాను.

౧౯౩౪ జులైలో నేను హిందీదురాక్రమణానికి ప్రతి కూలంగా ప్రారంభించిన ఆందోళనం కన్నడదేశందాకా పాకింది. తెనుగునాట కూడా హిందీప్రచారకులు నావాదంలోవున్న సత్యం కొంతవరకు గ్రహించారు. వారు కొద్ది రోజుల్లోనే సంపూర్ణసత్యం గ్రహించి మాతృభాషయెడల నిర్లక్ష్యానికి బదులు ఆదరమూ, నిరసనానికి బదులు అభిమానమూ వహించి ఆంధ్రజాతీ యవికాసానికి అడ్డంకులు లేకుండాచేస్తా రని నమ్ము తున్నాను.

జాయంటు పార్లమెంటరీ కమిటీరిపోర్టు ఒక్క చరువు చరిచి ఆంధ్రజాతిని మేలుకొలిపింది. మనవారి కీవేడి యింతట్లో చల్లారిపోకుండా వుంటుం దని ఆశిస్తున్నాను.

ప్రబుద్ధాంధ్ర ఆంధ్రజాతీయసేవకోసం పుట్టింది. దీన్ని సఫలపరచవలసిన బాధ్యత దేశీయులమీద వుంది.

ఈ చిన్నపత్రికకు మునపటిలాగే ఆర్థికపుష్టి కలిగించ వలసిం దని సంపన్నులనూ, భావోన్నతి సమకూర్చ వలసిం దని వ్యాసకర్తలనూ ప్రార్థిస్తూ, చక్కని చిత్రాలు రాసి యిచ్చి ప్రబుద్ధాంధ్రకు నూత్నశోభ సంఘటించిన శ్రీవడ్లి బాబూరావుగారికి, ఎస్. వి. ఎస్. రామారావుగారికీ నా కృతజ్ఞతను విన్నవించు కుంటు న్నాను.

పాతచందాదారులు మళ్లీ చందా లిచ్చి, తమ మిత్రు లచేత కూడా యిప్పించి సాయపడతా రని ఆశిస్తూ క్రొత్తసంవత్సరపు కార్యక్రమం ప్రారంభిస్తున్నాను.

**నటులు పునర్జన్మ మెత్తాలి**

మొన్నటి డిశంబరు ౩౦ వ తేదీ సాయంత్రం మదరాసు మిడ్లండు థియేటరులో ఆంధ్రనాటకరంగంయొక్క పతిత దృశ్యం ప్రదర్శించబడింది.

ఆవేళ ఆడబడిన నాటకం వేనరాజు అనేది. ప్రదర్శ నం రక్తికట్టే సన్నివేశా లందులో వున్నట్టు లేదు. అయినా రచన బాగానే—జటిలంగానే వుంది. ప్రదర్శ నంకూడా చక్కగానే సాగిపోతోంది. నిర్వాహకులు రంగప్రసాదనంలో కొన్ని లోపాలు చేసినా ప్రేక్షకు లున్నూ చక్కగానే వింటూ చూస్తూ వున్నారు. ఆంధ్రనాటకకళకి ఏదో కొత్తతేజస్సు అంకితం అవుతూ వున్నట్టు కనపడింది.

కాని సగం అయేటప్పటికి అల్లరి ప్రారంభం అయింది. మరో అరగంటకి అది దుర్భర మయిపోయింది. నటులు రంగస్థలంమీద నిలవడానికి వీలు కాలేదు.

గ్రంథకర్త స్వయంగా చెప్పబోయిన మాటలు ప్రేక్షకులు వినిపించుకోలేదు. మరికొందరు చేసిన ప్రార్థ నలు కూడా చెవిని పెట్టలేదు. చివరికి స్థానం నరసింహా రావుగారు మెత్తమెత్తగా చేసిన హితోపదేశమున్నూ కొరగాలేదు. చేసేది లేక నటులు తుంచేసినట్టు నాటకం ముగించేశారు.

"పాటలు పాడండయ్యాయ్!"

ఇదీ గోల. నాటకంలో పద్యాలు దండిగానే వున్నాయి. నటులు వాటిమీద సంగీతాన్ని అతిమా త్రంగానే ప్రయోగించారు. ఏ మయితే యేం? పాటలు లేవు. సంగీతరసికులు ఇక సహించలేకపోయారు. ఈలలు, చప్పట్లు, కేకలు, అరుపులు—వొకటే గోల.

అల్లరి చేసినవారు కొద్దిమందే; కాని గొప్ప ప్రయ త్నం—అనేకులు అనేకవిధాల చేసిన సేవ బుగ్గి అయి పోయింది.

గ్రంథకర్త విఖ్యాతాంధ్రకవు లయిన విశ్వనాథ సత్య నారాయణ ఎం. ఏ. గారు. ప్రదర్శనం యేర్పరిచినవారు అఖిలాంధ్రదేశానికీ సంబంధించిన నాటకకళాపరిషత్తు వారు. నటులు స్థానం నరసింహారావుగారు, డాక్టరు జి. వి. సుబ్బారావుగారు, మాధవపెద్ది వేంకటరామయ్య గారు, నండూరి శేషాచారిగారు మొద లయిన హేమా హేమీలు.

కవిత్వంలోనూ, చిత్రలేఖనంలోనూ మొన్న మొన్ననే ఆంధ్రకళాపరిషత్తువారివల్ల బహూకరించబడ్డ అడివి బాపిరాజు బి.ఎ., బి.ఎల్ గారు విశేష పరిశోధన చేసి ప్రత్యేకమూ యీనాటకంకోసం పూర్వకాలపు మాదిరిగా చాలా విలవయిన దుస్తులూ, ఆభరణాలూ తయారు చేయించారు. నటులనుకూడా చక్కగాదిద్దారు.

ప్రేక్షకులలో మద్రాసుఆంధ్రప్రముఖులలో అనేకులున్నారు. స్త్రీలు—నారీమణులున్నూ చాలామంది వున్నారు. అంతా చక్కగా అమరింది. కాని యీ సన్నివేశం సంగీతరసికుల ఉన్మాదాన్ని అడచిపెట్టలేకపోయింది. మరిన్ని ఆంధ్రనాటకకళా చరిత్రలో వొక పెద్ద సిరామరక పడకుండా ఆపుచెయ్యలేకపోయింది.

ఏం? ఇలా యెందుకు జరిగింది? ఇది క్షమించతగ్గది కాదు. అయితే: మననటులే తెచ్చిపెట్టినవుట్టిమునక యిది.

భాషాజ్ఞానం లేకపోవడంచేత భావప్రదర్శనం చెయ్యలేక, అసలు భావం గ్రహించనే లేక, కూనిరాగాలు తియ్యగలగడంవల్ల ఎంత గొప్పకవులు రాసిన నాటకాలలోనూ కూడా అసమర్థులూ, అనర్హులూ అయినవారిచేత దిక్కుమాలిన పాటలు రాయించుకుని, నటులు, వాటితో రంగస్థలంమీద పల్టీలుకొట్టడం ప్రారంభించడంవల్ల ప్రేక్షకలోకానికి నాటకంఅంటే యేమిటో, నాటకప్రదర్శనంలో తన కెలాంటి బాధ్యత వుందో గ్రహించే శక్తి చచ్చిపోయింది. పాటలు లేనిది నాటకమే కాదను దురుద్దేశం పుట్టిపోయింది. అదే ఆవేళ వేనరాజు ప్రదర్శనంలో చిందులు తొక్కింది.

ఏది యేమయినా దేశీయులలో యిలాంటి దురలవాటు ముదరడం జాతికి గొప్ప కళంకం.

దక్షిణభారతదేశంలో ఆంధ్రనాటకరంగానికి గల గౌరవం మరి దేనికీ లేదు; కాని మన సంగీతోన్మాదులు యితరజాతులతో సంపర్కం గల మద్రాసులో దాన్ని వూబిలో వూరదొక్కేశారు.

ఏతావతా: ఇదంతా నటుల దోషం. ఇప్పుడు ఆంధ్రనాటకరంగం బాగుపడాలంటే కవుల చేతుల్లో యేమీ లేదు. పరిషత్తువారి అధీనంలో కూడా యేమీ లేదు. పూచీ అంతా నటులమీద వుంది.

అయితే నటులు మళ్లీ కొత్తజన్మ యెత్తాలి. అంతే.

## ఆంధ్రనాటక కళాపరిషత్తు

ఇది మొన్నటి డిసెంబరు చివరి వారం అంతా మదరాసులో జరిగింది. తెనాలి నివాసులూ, విఖ్యాతనటులూ అయిన డాక్టరు జి. వి. సుబ్బారావుగారు అధ్యక్షత వహించారు. కొన్ని చర్చలూ, కొన్ని ప్రదర్శనాలూ, కొన్ని తీర్మానాలూ జరిగాయి. సాంఘికనాటకాలు రాయించి, పరీక్షించి, వెయ్యినూటపదహార్లు బహుమతీ చెయ్యడానికి మళ్లీ నిశ్చయం జరిగింది.

ఉడుకురక్తం గల యిద్దరు ఆంధ్రయువకులు — గూడవల్లి రామబ్రహ్మంచౌదరి, సీలంరాజు వెంకటశేషయ్యగార్లు పరిషత్తు యొక్క యీ నాలుగో సమావేశం చక్కగా నిర్వహించి శాస్త్రీయమైన నాటకకళని వృద్ధిరించే ప్రయత్నంలో దృఢమైన పునాదులు వేశారు.

పరిషత్సమావేశంలో లోపాలు స్ఫుటంగానే జరిగాయి; కాని యీ ప్రారంభావస్థలో అలాంటివి తప్పవు. మొదట్లో యెన్నో తప్పులు చేశాకే కార్యశూరులకు చెయ్యితిరిగి విజయం దొరుకుతుంది.

దక్షిణదేశీయులలో నాటకకళాపరిషత్తు ప్రారంభించడంలో మనమే మొదటి వారమని తెలుస్తున్నాము; కాని యిందుకు గర్వించామంటే 'భాషికరాష్ట్ర' సిద్ధాంతం విషయంలో లాగే మనం కూలబడిపోతాం.

రామబ్రహ్మంచౌదరి, వెంకటశేషయ్యగార్లలో మంచి నిర్మాణశక్తీ, దృఢమైన నిర్వహణసామర్థ్యమూ వున్నాయి. వారు వాటిని నాటకకళాపరిషత్తు విషయంలో మాత్రమే వినియోగించాలని కోరుతున్నాము.

ఇంకొక్క విషయం ఇక్కడ జరూరుగా చెప్పవలసివుంది. ఆంధ్రనాటకకళాపరిషత్తు ఇక ముందు ఎప్పుడూ మద్రాసులోనే జరగాలి. ఇప్పటిలాగ జటిలమైన కార్యక్రమం నిర్వహించబడాలన్నా, నిర్వాహకులకు తగినన్ని సౌకర్యాలు ఏర్పడాలన్నా, రాయలసీమవారికి కూడా యిది అందుబాటులో వుండాలన్నా, ముఖ్యంగా ఆంధ్రులకు మదరాసులో పలుకుబడి యేర్పడాలన్నా యిది మద్రాసులో జరగడమే చాలా అవసరం.

అయిదో సమావేశం మళ్లీ క్రిస్టమస్సులోనే తప్పకుండా జరుగుతుందనీ, అప్పుడింతకంటే మనం యింకో అడుగు ముందుకు వేస్తామనీ ఆశిస్తున్నాము.

ఆంధ్రమహాసభలు

నైజాం ఆంధ్రుల సమావేశం ఖమ్మంమెట్టులోనూ, బ్రిటిషు ఆంధ్రుల సమావేశం విశాఖపట్నంలోనూ జరిగాయి.

అక్కడా యిక్కడా కూడా యివి రాజకీయాలలోనం జరగలేదు.

అసలు ఆంధ్రమహాసభ కార్యక్రమం సంఘానికీ, సారస్వతానికీ, కళలకీ, పరిశ్రమలకీ సంబంధించినది కాని రాజకీయాలకు కాదు. సర్వవిధాలా ఆంధ్రజాతికి వికాసమే కలిగించవలసిన యీసభ యిలాగ వేరువేరుగా జరగడంలో ఔచిత్యం లేదు.

ఆంధ్రజాతి యింతలో బాగుపడ దనడానికి యిది బలమైన సూచనగా వుంది.

నైజాములో యెనిమిది జిల్లాల ఆంధ్రు లున్నారు. మనం రాజకీయంగా విడిపోయి వుండినా జాతిపరంగా ఏకం కావలసిన అగత్యం చాలా హెచ్చుగా వుంది. వొకటి కావడానికి ప్రయత్నించవలసిన పూచీ వుభయులమీదా సమంగానే వుండినా బ్రిటిషాంధ్రులకు— అందులోనూ సర్కారులవారికి అధికంగా వుంది. నైజామాంధ్రులకంటేనూ, రాయలసీమవారికంటేనూ అన్నివిషయాలలోనూ సర్కారులవారు ముందడుగు వేశా రన్న మాట వారు ఉభయులూ అంటూ వున్నదే. నిజంగా సౌకర్యాలు కూడా మనకి అధికంగా వున్నాయి.

అన్నిప్రాంతాల ఆంధ్రులనూ ఐక్యం చెయ్యడం పని కంటె ఆంధ్రమహాసభకి మరొక ప్రధానప్రాప్యం లేదు. ఈసంగతి మనం యెంత శీఘ్రంగా తెలుసుకుంటే అంత త్వరగా బాగుపడతాం. లేకపోతే ప్రకృతస్థితిలోనుంచి కూడా కిందికి వెళ్లిపోతాం.

మొన్న జరిగిన సభలకు ఆధిపత్యం వహించినవారిద్దరూ ప్రముఖులే. కాని ఇలాంటి యెందరు ప్రముఖులు పని చేసినా ఒకటేసభ అయ్యేదాకా ఏమీ చెయ్యలేరు. చెయ్యబూనడంకూడా మంచిది కాదు.

## హిందీవల్ల తెనుక్కి జరుగుతూ వున్న అపకారం



డిసంబరు నెలకి నెలా తెనుగునాడు హిందీకలవరింతలతో అస్తవ్యస్త మయిపోయింది.

సరిగా యీ సమయంలోనే వచ్చి కాకాకలేల్కరుగారు హిందీముగ్ధులమీద మరింత మెస్మరిజం ప్రయోగించారు.

వారంతటితో వూరుకుని వుంటే బాగుండిపోయేది; కాని హిందీవల్ల తెనుక్కి నష్టం లేదని కూడా వారు ఉపన్యాసాలు ప్రారంభించారు. ఈసంగతి వారికేం తెలుసు? వచ్చీ రావడంతోటే హిందీప్రచారకుల చేతుల్లో పడిపోయి, వారి సూచనలకు తుకానువాదం చేశారు కలేల్కరుగారు. దక్షిణదేశభాష లంటే ఆట వస్తువులుగా భావిస్తున్న ట్టుంది వారు.

మావాదాన్ని హేళనచేస్తూవున్న హిందీప్రచారకులూ, కలేల్కరుగారూ యింకో సంగతి తెలుసుకోవలసి వుంది. అదేమి టంటే? హిందీవల్ల వొక్క తెనుగే కాదు, కన్నడం కూడా చాలా నష్టపడుతోంది. ఈకింద ప్రకటించబడ్డ కర్నాటక సాహిత్యపరిషత్పత్రిక సంపాదకీయటిప్పణి చూస్తే యీ విషయం చక్కగా బోధపడుతుంది. దీన్నిబట్టి హిందీ, దక్షిణదేశంలో యెక్కడికి వెళ్లినా విలయతాండవమే చేస్తోం దనీ, తమిళులూ, మళయాళీలూ కూడా కొద్దిరోజుల్లోనే యీవిపత్తు గురించి ప్రతికూలంగా ఆందోళనం సాగిస్తా రనీ చెప్పడాని కేమీ సందేహం అక్కరలేదు.

భారతీయు లంతా ఎక్కణ్ణుంచో వచ్చిన ఇంగ్లీషు భాషని సామాన్యభాషగా వాడుకోడం సిగ్గుచేటని చెబుతూ వున్న హిందీప్రచారకులూ, కాంగ్రెసువాళ్లూ, దక్షిణదేశభాషలవారిని "మీ జాతీయభాషలను బురదలో వూరదొక్కుకుని హిందీని జాతీయభాషగా వాడు

కోం" డని వుపదేశించడం హాస్యాస్పదం అని గ్రహించలేకపోవడం వింతగా వుంది.

కానివ్వండి. సామాన్యభాషకీ, జాతీయభాషకీ యెంత వార వుందో గ్రహించలేదు వారు. కనకనే హిందీకోసం వారింత కాలమూ, డబ్బూ బూడిదలో పోస్తున్నారు.

అయితే. హిందీని ప్రోత్సహిస్తూ వున్నవారిలోనూ, ప్రచారం చేస్తూవున్నవారిలోనూ కొందరిలో ఆత్మపరీక్ష ప్రారంభం అయింది. ఇక కొద్దిరోజుల్లో యీ హిందీ కొంగు చప్పగా చల్లారకతీరదు.

౧

"భారతి అనే తెలుగుమాసపత్రిక ఆగస్టునెల సంచికలో 'హిందీ—తెలుగు' అనే పేరుతో ఒక సంపాదకీయలేఖనము ప్రకటింపబడింది. దేశభాషాదృష్టితో ఆలేఖనము తెలుగువారి కెంతవరకు అన్వయిస్తుందో కన్నడులకును అంతవరకూ అన్వయిస్తుంది. భారతిసంపాదకుల యీ యభిప్రాయంతో మేము సంపూర్ణంగా అనుమోదిస్తాము వారి లేఖనములోని 'తెలుగు' అనే మాటను తీసివేసి 'కన్నడము' అనే పదమును వేస్తే అది మనకు అక్షరశః అన్వయిస్తుంది. వారు స్వాభావికంగా ఆంధ్రేతరులకు మర్యాద చూపినారు. కాని యీ విషయంలో వారికంటే మనము ఉత్తములుగా ఉన్నామని భావించేటందు కేమీ అవకాశం లేదు. ఆంధ్రులు దేశవత్సలులు; దేశభాషాప్రియులు; కార్యదక్షులు. ఇది అందరికీ తెలిసిన విషయం. కన్నడులు వారికంటె ముందున్నారని మేమేమో నమ్మం. సంపాదకులు ఈ హెచ్చరిక చేశారంటే, హిందూదేశానికి ఒక రాష్ట్రభాష యొక్క ఆవశ్యకతను గాని, హిందీ ఆస్థానానికి రాగలుగుటకు గల యధికారమును గాని తెలియక చేసింది గాదు. భరతఖండము ముందుముందు సంయుక్తరాజ్యమైతే, దానిలో ఒక రాష్ట్రభాష యొక్క ఆవశ్యకత అనివార్యంగా వచ్చినట్టయితే, ఇంగ్లీషు సముద్రాలు దాటిపోతే, హిందీయే ఏకమాత్ర మయిన రాష్ట్రభాష యని అందరూ అంగీకరించినట్టయితే, అప్పుడు దానిని నేరుద్దాము. అన్నివిధాలా పరకీయమైన ఇంగ్లీషును నేర్వవచ్చునట; అప్పుడే అర్థం మన దయిన హిందీని నేర్చుకొనుట కష్ట మయ్యానా? దానివలన రాజకీయస్థాన, మాన, గౌరవములు, లాభప్రయోజనములూ కలిగేటట్లయితే అహోరాత్రులు అన్నం నీళ్లు వదలి దేశము దేశమే దానిని నేర్చుకోగలదు. కాని ప్రస్తుతము కొన్నికారణాలవల్ల కన్నడం మొదలయిన దేశభాషలకు పుష్టి లేదు; పురస్కారము లేదు. కన్నడం ఇప్పుడిప్పుడే ఇంకా పోతనీళ్లవల్ల పెరిగే మొక్కలమాదిరిగా తలయెత్తుతూంది. ఇప్పుడే అనావశ్యకంగా ఇతరభాషలు దానిని పట్టి ఆక్రమిస్తే గతేమి? కన్నడపుస్తకాలు వ్రాసినవారు, వ్రాయనున్న వారు అచ్చుకర్చు అందదని అవస్థపడుతున్నప్పుడు, పిల్లలకు మరొక గుటక పాలో, ఇంకో ముద్దో నెయ్యో వేయడానికి బదులు మన బీదతల్లులు పహిలాపుస్తకం, దూసరాపుస్తకములకు డబ్బుపెట్టి, ఏడుస్తూండే తమ బిడ్డలను ఎవరిపాలో చేసి హిందీపాఠాలకు ఎండలో తిప్పడంచూస్తే ఇదేమో ఒక విపరీతమైన అవస్థ వచ్చి పడినట్టు తెలుస్తుంది. ఏభాషమూలంగా వచ్చినా విద్య విద్యే. పోనీ, వీరు హిందీలో విద్యావంతులయినా అవుతారా? 'మీకు శ్రమం, మాకు దుర్భోజనం' మనలో ఆడవాళ్లు విశేషంగా హిందీని అభ్యసిస్తున్నారు, అభ్యసించినారు. అయితే ఎంతమంది హిందీలో స్వాభావికంగా ఉపన్యాసములను ఇవ్వగలుగుతున్నారు? ప్రౌఢము లయిన ఉపన్యాసాలను ఎంతమంది అర్థము చేసుకోగలుగుతున్నారు. నేర్చిన హిందీని ఎంతమంది శాశ్వతంగా నిలబెట్టుకుంటున్నారు? నూరార్లు ఖర్చుచేసి, ఏండ్లు దేహశ్రమ, బుద్ధిశ్రమపడి వీణ నేర్చిన మనస్త్రీలు తర్వాత వానిని తీసి చెయ్యాడించడాని కైనా అవకాశం లేక వానిని అటు కలమీద పడవేసి యుంటున్నారు. మన సామాజికస్థితి, ఆర్థికస్థితి యిలా వుంది. గాంధీమహాత్ముడు హిందీప్రచారాన్ని ఆరంభించి, దానికి పుష్టిని ఇచ్చినందువల్ల దానికి ప్రాశస్త్యం ఈమాత్రం వచ్చింది గాని, దాని నిజమైన మాహాత్మ్యం వల్ల గాని, ఆవశ్యకత వల్లగాని గాదని ఇతరదేశభాషలవారు గ్రహించవలెను. మహాత్ముని పేరుతో హిందీని కన్నడంమీద కూర్చొబెట్టేవారు బహుశా మన ప్రాంతాలలో నెలకొనిపోయి వుండే పరప్రాంతీయులైనా అయివుంటారు, లేదా మనలోని భ్రాంతులయినా అయివుంటారు. ఉత్తరహిందూదేశంలో హిందీకి తదితర

భాషలకు పరస్పర బాంధవ్య మున్నట్టు దక్షిణహిందూ దేశంలో లేదని వారు గ్రహింపవలసివుంది. కన్నడు లెవరూ హిందీని నేర్చుకోగూడ దని మేము చెప్పము. కాని కన్నడంయొక్క ఉత్కర్షకు హిందీని నేర్చుకోవలె గాని అపకర్షకు గాదు. కన్నడులు అరవాన్నీ నేర్వవలెను, తెలుగునూ నేర్వవలెను, గ్రీకులాటినులనూ నేర్వవలెను, జర్మను ఫ్రెంచి రష్యను భాషలనూ నేర్వవలెను. జపాను చైనా భాషలనూ నేర్వవలెను. ఈ భాషలన్నిటినీ కన్నడులు ఏ వుద్దేశంతో ఏప్రయోజనంకోసం, ఎంతమాత్రం నేర్చుకోవలసివుంటుందో హిందీని కూడ అంతమాత్రమే, అదే దృష్టితోనే నేర్చుకోవలెను. మొదట మన యింటి బిడ్డ వృద్ధికి రానీ, దానితో ఆటపాటలకు కావలిస్తే చుట్టుపక్కల బిడ్డలను చేరదీద్దాము. కాని యింటి బిడ్డను వదలి చుట్టుపక్కలవాండ్లను దగ్గర తీసే విపరీతౌదార్యము మనకు కూడదు."

కర్నాటకసాహిత్య పరిషత్పత్రిక (అక్టోబరు ౧౯౩౮)

౨

(ఈక్రింది లేఖ రాసిన శ్రీమతి కృష్ణకుమారి రాజమహేంద్రవరం నివాసులు మధురకవి నాళం కృష్ణారావుగారి కూతురు. చీరాల ఊటుకూరువారి కోడలు. ప్రౌఢభావాలతో చిన్నకథలు రాయడంలోనూ, మోడులు చిగిరించునట్టు వీణ వాయించడంలోనూ, శ్రోతలు తన్మయు లయేటట్టు గంభీరంగా ఉపన్యసించడంలోనూ చాలా నేర్పరి. వయస్సు రమారమి పదహారేళ్లే; కాని తన నిశితప్రతిభవల్ల అప్పుడే రాజమహేంద్రవరమహిళామండలిలో అత్యున్నతస్థానం సంపాదించుకుంది. ఇప్పుడు ఉభయభాషాప్రవీణ (చివరి) పరీక్షకు చదువుతున్నది. రాజమహేంద్రవరము నందలి వైశ్యసేవాసదనము (యువతీసంస్కృతకళాశాల)కు శోభ కలిగిస్తూవున్న రత్నాభరణాలు యిద్దరు బాలికలలోను ఈమె ఒకతె. ౧౯౩౩ వ సంవత్సరం డిసెంబరు ౨౯ వ తేదీని రాజమహేంద్రవరంలో ఆధునికాంధ్ర కవిపండితసభలో వ్యావహారికాంధ్రభాషను సమర్థిస్తూ తెనుగు వ్యాకరణంమీద యీమె చేసిన విమర్శాత్మక మైన వుపన్యాసం పండితులకు ఆశ్చర్యామోదాలు కలిగించింది. నాటి సభలో, సభాధ్యక్షులు రాయప్రోలు సుబ్బారావుగారు ఈమెకు "విదుషీకుమారి" అని అన్వర్థనామం వుంచారు. కృష్ణకుమారి ఆంధ్రయువతులలో ప్రశంసించతగ్గ పరిణామం కలిగిస్తుం దని ఆశిస్తున్నాము.

కృష్ణకుమారి హిందీని ద్వేషించడం లేదు. ముందుముందు— ఒకప్పుడు భారతదేశంలో హిందీకి భుక్తపడగల వొక గొప్ప శవాన్ని ఈమె గ్రహించే వుంది. ఇంతేకాక: ఈమె హిందీలో కొన్ని పరీక్షలు కూడా యిచ్చివుంది. కనకనే హిందీమరాక్రమణం గ్రహించగలిగి యీమె యీలేఖ రాసింది. మనకి మాతృభాషా, జాతీయభాషా అయిన తెనుగును గురించి యీమె పొందుతూవున్న ఆవేదన యీలేఖలో ప్రతీ అక్షరంలోనూ స్ఫుటంగా కనపడుతోంది. ఆంధ్రయువతీమణు లందరూ కృష్ణకుమారి హితబోధ గ్రహించి హిందీమీది వ్యామోహంవిడిచి మాతృభాషను ఆదరిస్తారని నమ్ముతున్నాము. కృష్ణకుమారికీ, ఇంకా యిలాంటి యువతీమణులకూ ప్రబుద్ధాంధ్ర స్వాగతం యిస్తోంది. సంపాదకుడు)

మానవునకు 'బహుజ్ఞత' అనేది తప్పకుండా ఉండాలి. ఇప్పటిస్థితిని బట్టి ముందుకు చూస్తే, బహుజ్ఞత లేనివానిని కొంతకాలం పోతే బహిష్కరిస్తా రేమో నని పిస్తుంది. కాని బహుజ్ఞతకు నిజస్థితి తలవంచకూడదు. అలా వంచితే వ్యక్తిత్వ మనేది నశిస్తుంది.

ఆంధ్రుడు —ఒక్క ఆంధ్రు డన్నమాట యేమిటి, అందరూను— శక్తి ఉంటే అన్ని భాషలూ నేర్చుకోవాలి— వద్దని యెవ్వరూ అనరు. అనకూడదు కూడాను. కాని తను నేర్చుకొనే భాష లన్నీ తనకే ఎసరుపెట్టేవిగా మాత్ర ముండకూడదు. "తనకు మాలిన ధర్మం మొదలు చెడినబేరం" అంటే ఎవరు ఒప్పుకుంటారు?

అలానే ఉంది ఇప్పు డాంధ్రులు హిందీ నేర్చుకొనే వేలంవెర్రిం. అసలు హిందీ ఎలా బాగా అలుముకొని పోయిందో చెప్పలేము. కాని— ఇది కాంగ్రెస్‌ని దూషించడం కాదు— కాంగ్రెస్‌లో పనిచేసి జైలుకు వెళ్లినవాళ్లు ఇవతలకు వచ్చినప్పటినుండీ హిందీ పట్టపగ్గాలు లేకుండా వరుగులెడుతూంది.

వచ్చినవాం డెన్ని వేషాలు వేసినా చెల్లుతుంది. ఏమీ లేని ఆకే ఎగిరెగిరి పడేద. తెలుగు నేర్చుకున్నవాళ్లూ, లోకజ్ఞానం ఉన్నవాళ్లూ, ఒకవేళ యేదైనా అలవడినా వెంటనే మార్చుకోగల సమర్థత ఉన్నవాళ్లూ, ఎన్ని నేర్చుకొన్నా, 'నేను' అనే స్థితిని మఱచిపోరు. వాళ్లకి మాతృభాషాజ్ఞానమూ ఉంటుంది. తెలుగే సరిగ్గా రాని పల్లెటూరివాళ్ల నెందుకు లేపి తందనాలాడించడం? మాధ్యం పల్లెటూరివారి సొమ్ము. అందుకనే 'కాళ్లు పట్టి లాగుతూన్నా చూరు పట్టుకు వ్రేల్లాడి" నట్లు అసలైన జానుతెలుగింకా పల్లెటూళ్లనుండి పోలేక పోలేక మినుకుమినుకు మంటూంది. ఈస్థితిలో నల్లేరు

మీద బండిలాగ ఈహిందీ ఒంటికాలితో పరుగెత్తింది. "మేము తెలుక్కి ఏం అపకారం జరపడంలేదు." అనే హిందీప్రచారకులమాటలు ఏడ్చేవాళ్లకు కళ్లనీళ్లు తుడవడం లాగుంది. వాళ్లు పట్టణాల్లోకంటె పల్లెటూళ్లల్లో ప్రచారం సాగించడమే లోలోపల తెలుగుని కూకటివేళ్లతో పెల్లగించేస్తున్నారని తెలుపుతూంది. లేకపోతే పట్టణాలు కాని పాలకొల్లు, పాంగువ్వ, భీమవరం. తణుకు, రామచంద్రపురం, విస్సాకోడేరు, కోలమూరు, గనపవరం— తెలుగుజాతీయత కాయువుపట్టులైనవి—ఇల్లాటివాటిల్లో ఎందుకు వీరిదాడి? దీన్నే కాబోలు తడిగుడ్డలతో గొంతు కొయ్యడ మంటారు!

పైగా "హిందీవల్ల, ఏమీ రాని తెలుగువాళ్లు వ్యాకరణం నేర్చుకొంటున్నారు." అని వాదం! ఇదెక్కడి అన్యాయం! ఒకమూల వ్యావహారికవాదులు బయల్దేరి 'వ్యాకరణాలే వద్దు బాబూ! కట్టకట్టి గంగలో కలపండి' అని మొత్తుకుంటూంటే, మళ్లీ వ్యాకరణమా? అందులోనూ ఇతరభాషా వ్యాకరణమా? ఆవ్యాకరణం వచ్చి తెలుగుభాష నేం ఉద్ధరించనూ? రాక ఏం చెరవనూ? ఏదీ లేదు. పైగా ఆహిందీ వ్యాకరణ సాంప్రదాయాలు తెలుగులో జొన్పి తెలుగులో ఉన్నది కాస్తా ఊడ్చిపెట్టడం ఎందుకీ లేనిపోని క్షోభ?

తర్వాత "హిందీ నేర్చుకుంటే సంస్కృతం కూడా సులభంగా వస్తూంది." అనడం! రామా! వినలేక చెవులు తడికలు కట్టుతూవున్నవి. అష్టకష్టాలు పడి నేర్చినవాళ్లకే సంస్కృతం ఒకపట్టున లొంగదు. ఎక్కడో హిందీలో ఒకమాట దొర్లితే సంస్కృత మంతా వచ్చినట్లే! ఎంత అజ్ఞానం! పోనీ, ఏదీ ఈ హిందీ ప్రచారక పండితు లెవరైనా ఒకచిన్ని అనుష్టుప్ శ్లోకాని కర్థం చెప్ప మనండి చూతాము! ఎలా చెప్పగలరు? అది వాళ్లదోషం కాదు. హిందీభాషాపద్ధతి వేరు; హిందీ కారకం వేరు. సంస్కృత భాషాపద్ధతి వేరూ; సంస్కృత కారకం వేరూను. జన్యజనక భావసంబంధ ముందేమో, కాని, హిందీ వచ్చినంత మాత్రాన సంస్కృతం వస్తుందనడం కేవలం హాస్యాస్పదం.

ఇన్నిటిని మించిన అన్యాయం ఏమి టంటే, ఆడువారికి హిందీ మప్పడం. 'ఇంకా ఆడవాళ్లు తెలుగు నేర్చుకోడానికే ముందుకు రావడం లేదు. ఇంకా వీరికి మంచివిద్య కావాలి, పునాదిదిట్టం లేక ఆడవాళ్లు ఆకాశతాండవం చేస్తున్నారు? అని గోల పెట్టూంటే, వారివిద్యాసాధనాని కివొక అంకిలా! ఉబుసుపోని ఆడవాళ్లు హిందీ కుపయోగించే కాలం తెలుక్కి ఉపయోగిస్తే ఎంత అందంగా వుండేదో? ఇప్పుడిప్పుడే తలెత్తుతూన్న స్త్రీవిద్య అంతరించకుండా ఉండడానికైనా, హిందీ ప్రవాహం అరికట్టాలి. పల్లెటూళ్లను, ఆడవాళ్లను ఆలంబనంగా చేసుకొన్న హిందీప్రచారకుల సూక్ష్మబుద్ధిని మాత్రం మెచ్చుకోవలసిందే.

ఇంక పత్రికలు ఒక్క తెలుగుపత్రికకూ— భారతికైనా— ఆదరించే ప్రభువు ఆంధ్రులలో ఒక్కడు కూడా లేడు. ఇంతకంటె నిజంగా ఆంధ్రజాతికి అతి అవమానకర మైన విషయం ఇంకేమీ లేదు. కేవలం ఆర్థికదుస్థితే దీనికి కారణం కాదు. ఉన్న సొమ్ము కాస్తా మాధురి, ఆనంద్, బాలసఖా ఇలాంటి హిందీపత్రికలకి ఊడ్చిపెట్టి తెలుగుపత్రికలు కొనవచ్చేసరికి ఖాళీపర్సు తల్లక్రిందులు చేసి తెల్లబోతున్నారు— ఒకటా! రెండా! తెలుగుదేశంలో ఉన్న హిందీపత్రికలుకొన్ని మాధురీ, బాలసఖా— సరస్వతి, విశ్వామిత్ర, చాంద్, బాలమిత్ర, వానర్ విశాలభారత్, ఇన్నిపత్రికలకి ప్రచార మెందుకూ! తెలుగుపత్రికల కీచిత్రవధ యెందుకూ! ఆంధ్రుల పేరుతో ఉన్న దైనికపత్రిక ఒక్కటే: దానిలో కూడా వారానికీ, పదిరోజులకూ, ఒకటీ, ఒకటిన్నర కాలం హిందీవ్యాసాలకి మీదుకట్టడ మెందుకూ?

అసలే ఆర్థికదుస్థితి. అందులో జి. వొ. తెలుగు ఉపాధ్యాయులకు జీతాలు కోసేసింది. కాలేజీకి వెళ్లినా నలుబదిరూపాయిల కెక్కువ రావు. అట్టిసమయంలో హిందీమహావిద్యాలయాలు పెట్టి, అందులో ప్రధానాచార్యులకి ఒక్కరికే నెలకు ౭౦ రూపాయిలు జీతం ఇచ్చి తెలుగువాళ్లు తమచేత్తోనే మట్టికొట్టుకుంటూన్నా రంటే, ఏ తెల్గుమనిషికి కోత కాదూ?

నిజం చెప్పాస్తే—గౌతమీలైబ్రరీ వంటి గ్రంథాలయం తెలుగుగడ్డలో చూడబోము—అదే అన్నం పెట్టే దాత లేక, అప్పులపాలై ఉంది. ఈలాంటిదైన్యంలో

ఉన్న గ్రంథాలయాల్ని లేవనెత్తే ఉద్దేశం ఏమీ లేదు. పైగా ప్రతివూళ్లో 'హిందీప్రేమీమండలులు' క్రొత్తగా స్థాపించడం! ఎవరు సైచగలరు?

తెలుగులో 'నేను' అని ధమాయించి ప్రతివిషయం లోనూ జంకూ, గొంకూ లేకుండా మాట్లాడేవాళ్లింకా తక్కువ. తెలుగులో వాగ్వర్ధనీసభ లున్నాయో లేవో ఎవరికీ తెలియదు. ఏమైనా పెద్దా మంటే 'తెలుగులో పుట్టినవాళ్లకి తెలుగుమాటలు నేర్చుకోవడం ఏమిటి! సిగ్గులచేటు' అని తెలుగువాళ్లే అడ్డవుల్ల పెట్టారు. అటు వంటిసమయంలో ఏవూళ్లో చూచినా హిందీవాగ్వర్ధనీ సభలు, హిందీచర్చాసమాజాలు, హిందీవక్తలు పేర్మోగడం విని వూరుకోవడం ఎల్లాగో తెలియడం లేదు.

నాటకాలు చూస్తే నటులలోపమో, కవిలోపమో, నియంతలోపమో, డబ్బు లోపమో, ఆదరణ లోపమో, అదృష్టం లోపమో, అన్నీ లోపమో, చెప్పలేము కాని—తెలుగులనాటకరంగం అంటే తెలుగువాళ్లకే మొగంమొత్తిపోయింది. ఇలా పడిపోతూన్న నాటకకళను లేవనెత్తుకోవాలి. అది లేదు సరి కదా! ఇంకా "హిందీవృద్ధి కావలయు ననినచో ప్రతియూరను హిందీనాటకము లాడవలయును" అని తెలుగువారే శాసిస్తూ ఉద్బోధిస్తూ ఉపన్యాసా లియ్యడంలో కల ఉద్దేశం ఏమిటో అర్థం కాదు. తెలుగుదేశంలో తెలుగుస్టేజీలో హిందీలో తైతక్క లాడడానికి వచ్చిన పుట్టిమునక ఏమిటో బోధపడదు.

ఇల్లాగ హిందీలో ఇపు డెన్నివిధాల ప్రచారం జరుగుతోందో అన్నివిధాలా మనఆంధ్రులు వెనకబడి ఇపుడిపుడే తలలెత్తుతూంటే, 'అన్నప్రాశననాడే ఆవకాయబద్ద' అన్నట్లు, ఇంతలోనే హిందీకి ఇంత హాంగామా ఎందుకు? ఇంకా హిందీలో వృత్తివిద్యలు నేర్పలే దనీ హిందీలో నిత్యవ్యవహారం జరగడం లే దనీ, హిందీ కౌన్సిళ్లల్లో పెట్టలే దనీ (బందరు) హిందీలో నాటకా లాడలే దనీ, హిందీలో ఉపన్యాసా లియ్యడం లే దనీ, హిందీని నెత్తికెక్కించుకో లే దనీ నెప మెన్నడం కూడాను! హింస చాలక ఇంకా హత్య కూడానా?

ఇంతప్రచారం, ఏకభాష కావా లనీ, 'రాష్ట్రభాష' అని కదా! గాంధీజీ పరులను తృప్తిపరచే స్వభావం కలవాడు. అందుకే ఆయన మాలవ్యాజీ విడిపోతూన్నా, మహమ్మదీయులని కూడగట్టుకొన్నాడు. ఇపుడు తురకలు ఉర్దూ రాష్ట్రీయభాష కావా లనీ, పార్శీ లిపి కావా లనీ దెబ్బలాడుతున్నారు. ఆ మెత్తని గాంధీజీ ఏమీ అనలేక దేశహితంకోసమే—వాళ్ల కోర్కెలు తీరిస్తే, మనం రాష్ట్రభాష అవుతుం దని ఆశించి నేర్చుకొన్న హిందీని ఏగంగలో కల్పుతాము? 'ఉర్దూకి, హిందీకీ ఏమీ భేదం లేదు. ఉర్దూ రాష్ట్రభాషైనా ఫర్వా లేదు.' అని యీమధ్య హిందీప్రచార సప్తాహంలో ఒకప్రముఖుడు అభయహస్త మిచ్చాడు. మరీ ఆశ్చర్యం! 'తురక కబ్బెరా తురకబుద్ధి' అని హిందీకే కాదు, ఉర్దూకి కూడా మనం తలవొగ్గాలి! ఇంతకంటె దౌర్భాగ్య మున్నదా? అదీ కాక మనం నేర్చుకొనేది గ్రాంథికం కాని వ్యావహారికం కాదు. అందుకే ఎంత నేర్చుకొన్నా ఆంధ్రులహిందీ గాణకెక్కడం లేదు. ఇక్కడ నాఅనుభవం ఒకటి ఉట్టంకించడం అనవసరం అనుకోను— ఈమధ్య గాంధీజీతో జమ్నాలాల్ బజాజుకూతురు కూడా వచ్చింది. అపుడు ఒకరు హిందీపండితులు ఆవిడతో వచ్చినంతవరకూ వ్యాకరణం తప్పకుండా నిర్దుష్టంగా హిందీ మాట్లాడారు. అప్పు డావిడ "ఏమి టింత మోటుగా మాట్లాడుతున్నారు?" అంది. అయింది! తెలుగుల హిందీ నేర్పు! హిందీనేర్చుకొని సాధించే పరమప్రయోజనం ఇప్పట్లో ఉత్తరాదికి వెళ్లితే ఎల్లాగూ? అని కదా! విద్యావతి యైన బజాజుకొమరితయే 'మోటు' అంటే సామాన్యజనులకు మనకృతకహిందీ— జాతీయతా విరహిత మైనది— అర్థం అవుతుందా? అని నా ఆశంక!

ఉర్దూ రాష్ట్రభాషే అయితే నేర్చుకోవడం— అంటే గ్రాంథికంగా ఉర్దూ నేర్చుకోవడానికి మళ్లీ కొన్నాళ్లు ఆంధ్రశక్తిని ధారపోస్తే సరి! ఏ మున్నది! 'ఉరిపోసుకోడాని కేతాడైతే నేమి' అన్నట్లు, ఆంధ్రం అడుగంటడానికి హిందీ యైతే నేం, ఉర్దూ ఐతే నేం. ఖర్చుపెట్టడానికి కాలం ఉంది! నేర్చుకోడానికి తెలుగుమీద జాలి లేని హృదయాలున్నాయి!

మంగిపూడి వేంకటశర్మగా రన్నట్లు, క్రొత్తలో వేలంవెట్టిమూలాన, గ్రామాల్లో తెలుగులయిండ్లు హిందీలోగిళ్లే అయిపోతే, ఆంధ్రరాష్ట్రవిభజనకి ప్రయత్నా

లెందుకూ ? రోము, ఇటలీ ఐర్లండు, దేశభాష నాదరించి స్వరాజ్యం సంపాదించినాయి అన్న పేరు పొందుతే, ఆంధ్రదేశం హిందీ నాదరించి హిందీ దేశ మైపోయింది. అన్న పేరు పొందుతుంది. ఓహో ! పొగడదగిన పేరు ! ఇటువంటి నిర్వీర్యం చూచే ఓఢ్రులు తెలుగు రాజ్యాం అన్యాయంగా తాము ఆక్రమించడానికి పూనుకొన్నారు. చివరకు మనఅవస్థ ఒడ్డెవారితో కూడ ఒడ్డలేక ఒడ్డిగిల్లాము. లేకపోతే యేగుండెతో అడగగలరు ? ఈ ఉపేక్ష చూసే కన్నడిగలు, అరవలు, తురుష్కులు ఆంధ్రదేశానికి అంచులు కొరికేస్తున్నారు. మెత్తని వాళ్లని చూస్తే మొత్త బుద్ధి !— దీనిలో ఏమీ అత్యుక్తి లేదు. ఇప్పటి కింత అపకారం జరగకపోయినా 'ఏక్కై వచ్చి మేక్కై బిగిసిపోతుంది' హిందీ. ఇది లోకంలో జరుగుతూన్న సాజమైన పరిణామం. ఇంగ్లీషిలాగే చేసింది కాదూ ? ఏది వచ్చినా ముందే ఒడిపట్టే తెలుగు వాళ్లకి మంచి ప్రాయశ్చిత్తం జరుగుతూంది. ఇంగ్లీషు 'బలవంతబ్రాహ్మణార్థం' ఔతూంటే, హిందీ కోరి తెచ్చుకొన్న తిద్దినం అయింది.

హిందీప్రచారకు లింకోసంగతి చెప్తారు. "హిందీలో ద్విజేంద్రలాల్ రాయ్ నాటకాలున్నాయి. ప్రేమచంద్ నవల లున్నాయి మన (మీ) తెలుగులో ఏవీ ?" అని ఈమాటలే హిందీప్రచారకులకి తెలుగెంతవఱకు వచ్చునో తెలియచేస్తూన్నాయి. అయ్యో ! తెలుక్కి రసవంతము లైన నాటకాలూ, నవలలే తక్కువయ్యాయి! సరియైన పరిశీలన లేక చెప్పినంతమాత్రాన ఆంధ్రంలో మనోరంజక మైన సారస్వతం ఒక్కమాటు అదృశ్యమై పోదు 'పంచాంగము తప్పిన గ్రహసంచారముమానునె' నిశ్చయంగా ద్విజేంద్రలాల్ నాటకాలూ ప్రేమచంద్ నవలలూ అతిమనోహరమైనవే. అని ఒప్పుకుందాము. అటువంటి ఆదర్శక మైన రచన మృదుమధుర మైన హిందీలో ఉండడం బంగారునకు తావి యబ్బినట్లే. కాని తెలుగులోనే మనోహరభావాల్ని అర్థం చేసికోలేని అమాయికమైన తెలుగురాని జనం పరభాషలో ఆ అందమైన భావాల్ని అర్థంచేసుకోగలదా ? అని వీరికి స్ఫురించదు కాబోలు. కొందఱికి హిందీలో మాట్లాడడం నాజూకు ! వాళ్లు తెలుగులో మాట్లాడడాని కేదో అనాగరికత అని భావిస్తారో ఏమో మఱి ! ఇంతవఱకింగ్లీషువ్యామోహం ఇల్లాగే ఉండేది. ఇపుడిపుడు ఒక బొప్పి కట్టనతర్వాత కొంచెం చూసుకొని నడుస్తున్నారు. ఇపుడు మళ్లీ హింస్త్రీతడాకా !

బెంగాలీవారు 'హమారాసోనా బెంగాలీ' అంటే మనకు 'మా ముత్యాల తెలుగు' అని మురిసిపోయే ప్రొద్దులు రావాలి. అపుడు మన మింకోభాషకోసం ప్రబల ప్రచారం చెయ్యవచ్చు. హిందీ రాష్ట్రభాషమైనా, రమణీయమైనదీ, ఆకర్షణీయమైనదీ (మన తీయని జాను తెనుగు కన్న మధుర మైనది." అంటే నేను ఎంతమాత్రం ఒప్పుకోను) కాబట్టి స్వరాజ్యం వచ్చిన మరునాడు మనం దాన్ని నేర్చుకోవచ్చు. అంతే కాని, ఎప్పుడో స్వరాజ్యం వస్తుం దని 'మబ్బును నమ్మి చెరువుకట్ట తెగొట్టుకొన్నట్టు ఇప్పటినుండీ నేలవిడిచిన సాము చెయ్యడం యుక్తంకాదు. మన కిపుడు బహుజ్ఞత మితిమీరి వ్యక్తిత్వం నశించిపోతూంది. అవసరమైనవారు (వర్తకులు) ప్రచారం లేకుండానే హిందీ నేర్చుకుంటూనేవున్నారు. ఒకపేరు పెట్టుకొని బ్రదుకుతూ వున్న దేశంలో ఇంకొక భాషకు ప్రచారం చేయవలసిన గతి యేమి ! ప్రచారం వద్దంటే మనవాళ్ళే కఱవుచ్చే స్థితివఱకూ విషమించింది. మనకాలాన్ని పాడుచేసుకోవద్దు. ఈకాలాన్ని ఓఢ్రుల నెదుర్కోవడంలోను, ఆంధ్రరాష్ట్రనిర్మాణంలోనూ, రాయలసీమవారిని సముదాయించడంలోనూ, పడిపోతూన్న తెల్గునకు చేయూత నియ్యడంలోనూ వినియోగించేస్తే తెలుగుదేశం ధన్యమౌతుంది. తెలుగు వాళ్లు గొడ్డుపోలేదు. అనిపించాలి. అనవసర మైనదానికి కాలాన్నీ, డబ్బునూ వెచ్చించి అవసరాల్ని చేమించిపోనీయకండి. రవ్వ ధారపోసి గవ్వ కొనవద్దు.

'ఆంధ్రభాష యేమిటీ, హిందీభాష యేమిటీ? అంతా ఒకదేశంలో లేమా ? ఇటువంటి సంకుచితాభిప్రాయాలు పనికిరావు. మాకు మాత్రం తెలుగుమీద అభిమానం లేదా? ఐతే మాత్రం ఏమి ? హిందీ తప్పక నేర్చుకోవలెను" అని శాసించే సవతితల్లి ఆంధ్రాభిమానం కల మహానుభావులకు ఒకటే నమస్కారబాణం. వారిజోలికి పోవద్దు.

ఎంత కని సైరణ ? దేనికైనా హద్దువద్దు ఉండవద్దూ?

కృష్ణకుమారి

**అతిమధురము :—మధుయష్టి—Glycyrrhiza glabra.**

**స్వరూపము** దీనినే యష్టిమధురమని కూడ యందురు. ఇది రెండు విధములుగా నుండును. నీటిప్రదేశమునం దొకటియు, మెట్టప్రదేశమునం దొకటియు బయలుదేరును. ఇది గుల్మజాతిలో చేరును. నిలువెత్తువరకును పెరుగును. దీని ఆకు మరువము ఆకును బోలియుండును. గుండ్రముగా నుండును. దళసరిగా నుండును. దీని కొమ్మలు వేరును కూడ నారగలిగి యుండును. పువ్వులు తెలుపుగ గుత్తుగుత్తులుగ నుండును.

**గుణములు** ఇది యోగసిద్ధిని కలుగజేయును. ఇది చలువ చేయును. ఎక్కువ తీపియు, కొంచెము కారమును కలిసిన రుచి కలిగి యుండును. నాలికమీద వేసి కొనిన కొంచెము చిమచిమలాడి నీ రూరును. విపాకమున తీపిరుచియే కలిగి యుండును. నేత్రరోగములకు ఇది చాల మంచిది. శిలవెండ్రుకలను పొడవుగా పెంచును. నల్లపరుచును. దప్పి యెక్కువగా నుండి నోరార్చుకొనిపోయిన, దీని వేరుముక్క చప్పరించిన చమగలిగి దప్పి కట్టును. విషమును హరించును. పైత్యములను, వాంతిని నివారించును. క్షయను పోగొట్టును వీర్యము వృద్ధినొందించును. వ్రణములలో నుండు కుళ్లును శోధించి మాన్పును. శోకరోగములకు కూడ నిది చాల మంచిది. రసాయనద్రవ్యము.

**ప్రయోగములు** రసాయనమునకు :— యష్టిమధురము యొక్క చూర్ణము పాలలో కలిపి త్రాగిన, ముసలితనమును, రోగములను రాకుండ జేసి చాల కాలము బ్రతుకునట్లు చేయును.

క్షతక్షీణమునకు :—క్షతక్షీణ మనగా గుండెలో నుండు, అవయవములకుగాని, యితర మర్మావయవములకు దెబ్బ తగిలినచో నోటి వెంబడిని రక్తము పడుచు మనిషి క్షీణించును. దీనినే క్షతక్షీణ మందురు. శొంఠియు, యష్టిమధుకమును కషాయముపెట్టి పాలు కలిపి త్రాగినను లేక వీని చూర్ణము పాలతో కలిపి త్రాగినను క్షతక్షీణమును హరించును.

హృద్రోగమునకు :—యష్టిమధుకము యొక్కయు, కటుకరోహిణి యొక్కయు, నూరిన ముద్దను, పంచదారనీళ్లతో కలిపి త్రాగిన, హృదయరోగము లన్నియు నివర్తించును. (చి॥26—అ—చరకము)

గర్భిణీయొక్క గర్భముగాని, లోని శిశువుగాని శుష్కించిపోయి గర్భము ఎదుగక పోయిన :—పాలలో పంచదారయు, నేలగుమ్మడి, యష్టిమధురమును కలిపి త్రాగిన శుష్కించిన గర్భము వృద్ధినొందును. (చరకము)

పాండురోగమునకు :—యష్టిమధురముయొక్క చూర్ణముగాని, కషాయముగాని తేనెతో కలిపి త్రాగిన పాండురోగము నివర్తించును. [సుశ్రుతము 44 అ. ఉత్తరస్థానము.)

# గంధర్వకళ

## రక్తపుష్టి, వీర్యవృద్ధి, నరములకు బిగి కలిగించు తియ్యని లేహ్యము

అనేకులకు మంచి మగతనము కలిగించి పేరుపొందినది

గంధర్వకళ [illegible] సంఘటించును. శుక్లనష్టము కట్టును. పుంస్త్వము పెంపుచేయును. కామో ద్రేకము కలిగించును. సంభోగశక్తి [illegible] చేయును. మనోల్లాసము కూర్చును. ఆనందము కలిగించును. ప్రమేహములను [illegible]

కీళ్ళనొప్పులు, [illegible]దలు, తి[illegible]లు, పోనాడుటలో గంధర్వకళ ప్రత్యేకశక్తి కలది. సహా మేహములమీద ఇది చేయు పని అసాధారణమైనది. దీనిని ఎప్పుడును సేవించుచుండినచో ముసలితనము కనబడదు. ఏ వ్యాధులును చేరవు. ఇది బాలింతరాండ్రకును చాల మేలుచేయును. వారి శరీరములకు పూర్వపుబిగి కలిగించును.

పౌను రు. 8—0—0

# మలయచందనము

## సెగరోగమునకు పేరుపొందిన ఔషధము

పోటీలలో నెగ్గినది. నకళ్ళను చూచి మోసపోకుడు!

ఈ క్రూరవ్యాధివలన బాధపడువారికి మా మలయచందనము నాలుగువందల యేండ్లనుండి గురుపరంపరగా వాడబడుచున్నది. ఇది సంస్థానములయందును రాజకుటుంబములయందును వాడుటకు కనిపెట్టబడినది. కావున నే పథ్యము లేదు. పిచికారితో పనిలేదు. సెగరోగము తగిలినట్లు, మందు పుచ్చుకొనుచున్నట్లు నెవరికి తెలియకూడదంటే మా మలయచందన మొక్కటే అందుకు తగినది. నకళ్లు బయలుదేరుచున్నవి. పరిశీలించకుండ ఏ యౌషధమును పుచ్చుకోవద్దు. గంధర్వఫార్మసీవారి మలయచందనమే కావలెనని కోరుడు. అనేక వైద్యులు సొంతమందులను విడిచి దీనిని వాడి విజయము, బహుమతులు పొందుచున్నారు. మూత్రపుమాటలలో గుణమిచ్చును. ఎరుపు, తెలుపు, పచ్చసెగలకు ఇది రామబాణము. రస విష గంధకములు చేరని మూలికాయోగము. ఇక్కడకు అక్కడకు వరుగెత్తక నేడే మాకు వ్రాయుడు.

డబ్బీ 2—4—0 దీని కనుపానము చందనతైలము ఔన్సు 8—0—0 రెంటును ఖర్చులతో 6—0—0.

# నాగరఖండము

అజీర్ణములకు శూలలకు, పరిణామశూలకు చాల మంచిది. ఆకలిలేకపోవుట, కడుపుఉబ్బరము, నొప్పి, నోట నీరూరుట, కడుపులో మంట, త్రేన్పులలో పోటు, కండ్లమంట, ఓకిరింత, వాంతులు, పుల్లత్రేనుపులు, భస్మక, అ[illegible] వంటివి త్వరగా తగ్గించును. విడువకుండ ఒక్కపౌను సేవించినచో ఎట్టి గురువదార్థమైనను సులభముగా జీర్ణం. మంచి ఆకలి కలుగజేయును. రక్తపుష్టి కలిగించును.

పౌను రు 8—0—0.

గంధర్వఫార్మసీ—ఇన్నీసుపేట, రాజమండ్రి

